# ఆంధ్రపత్రిక



3/9/08

THE ANDHRA PATRIKA - MADRAS. సంపుటం 42. సంచిక 154 FOUNDER DESODHARAKA K. NAGESWARA RAO శనివారం 3-9-1955 Reg. No. M. 1118 6 పేజీలు 1 అణా.

# సంవత్సర ప్రారంభంలోనే అమ్మకం పన్ను వసూలు

## ఇజ్రేల్‌కు వ్యతిరేకంగా అరబ్ రాజ్యాల సన్నాహం

### ఇరుపక్కలా నష్టాలు: దాడులు ఆపాలని యత్నం

టెల్ అవీవ్, సెప్టెంబరు 1: ఇజ్రాయల్‌పై చావుదెబ్బ తీసే వుద్దేశంతో అన్నివైపులనుంచి ముట్టడించడానికి అరబ్ రాజ్యాలు సమిష్టిగా, తమ సైనికదళాలను ఉరికిస్తున్నవని సిరియన్ రేడియో ప్రకటించింది.

ముట్టడికి"ఘడియ"సమీపిస్తోందని ఇజ్రయల్ ను యీ రేడియో హెచ్చరించింది.

సిరియన్ సరిహద్దు రక్షక దళాలు ఒక ఇజ్రయలీ గ్రామంపై గుండ్లవర్షం కురిపించాయని ఇజ్రయలీ సైనిక ప్రతినిధి చెప్పాడు.

హదులో నిరంతరం ఘర్షణలు జరుగుతూ వుండటం చాలా ప్రమాదకరమని బ్రిటను రెండవసారి మళ్లీ ఉభయ దేశాలకు హెచ్చరిక చేసిందని విదేశాంగశాఖ ప్రతినిధి చెప్పాడు.

### ఈజిప్టు - ఇజ్రేల్ నష్టాలు

కెయిరో, సెప్టెంబరు 1: ఖాన్ యూనిస్ ప్రాంతంలో గత రాత్రి జరిగిన సంకుల సమరంలో పదిమంది అరబ్బులు మరణించారని 12 మంది గాయపడ్డారని ఒక అధికార ప్రతినిధి చెప్పాడు. ఒక పోలీసు స్టేషన్‌ను కూడా ఇజ్రాయలీ దళాలు పేల్చివేశాయని అంగీకరించారు.

ఖాన్ యూనిస్ ప్రాంతంలో జరిగిన పోరాటంలో 40 మంది ఈజిప్షియన్లను ఇజ్రయలీ దళాలు చంపివేశాయని మరో 40 మందిని గాయపరచాయని ఇజ్రయలీ రేడియో ప్రకటించింది.

యుద్ధవిరమణ రేఖ పొడవునా ఇక కాల్పులు విరమించవలసిందిగా ఈజిప్టును ఇజ్రయల్ కోరినట్లు కెయిరో రేడియో ప్రకటించింది.

### ఇజ్రేయల్‌పై ఈజిప్టు దాడి

కెయిరో, ఆగస్టు 31: ఈజిప్షియన్ సైనికదళాలు నిన్న ఇజ్రయల్ భూభాగంలో 25 మైళ్లు దూరం వరకు చొచ్చుకుపోయి 15 మందిని చంపివేశాయని ఈజిప్షయన్ వర్గాలు నేడు తెలిపాయి. అంతేగాక ఇజ్రయల్‌కు చెందిన ఒక రేడియో స్టేషన్ పనిచేయడానికి వీల్లేకుండా ఆ రేడియోకేంద్రం ఆవరణలోని వాయుప్రసార స్తంభాన్ని (ఏరియల్ పోల్) ప్రేల్చివేశాయి.

ఒక ఇజ్రయల్ గూఢచారిని నేడు ఈజిప్షియన్ పోలీసులు అరెస్టుచేశారు. సరిహద్దులలో దాడులు జరపడానికి ఈజిప్షియన్ సైనికాధికారులు "ఆత్మ వినాశక దళాల"కు శిక్షణయిచ్చి పంపుతున్నారని ఇజ్రయల్ సైనికశాఖ వారపత్రిక ఒక ఆరోపణచేసింది.

### లెబనాన్‌తో సంప్రతింపులు

ఉభయులకు సంబంధించిన రక్షణ, అంతర్జాతీయ వ్యవహారాలు, ఇంకా ఇతర సమస్యల గురించి చర్చించుకోవడానికి ఈజిప్టు, లెబనాన్‌లు అంగీకరించాయని ఒక సంయుక్త ప్రకటన వెలువడింది.

నేడు ఈజిప్టు ప్రధాని గమాల్ అబ్దుల్ నజీర్ లెబనాన్ విదేశాంగ మంత్రి హమీద్ ఫరాంగియా ఇరువురు సంభాషించుకున్నారు. అరబ్ లీగును మరింత పటిష్టం చేయాల్సిన ఆవశ్యకతను ఉభయదేశాలు గుర్తించాయని యీ ప్రకటనలో పేర్కొన్నారు.

### ఈజిప్టు విమానాల కూల్చివేత

టెల్ అవీవ్, సెప్టెంబరు 1: గాజా సరిహద్దులో రెండు ఈజిప్షియన్ వాంపైర్ జెట్ విమానాలను ఇజ్రయల్ కూల్చివేసినట్లు ఇజ్రయల్ వర్గాలవారు ప్రకటించారు.

### ఇజ్రేల్ పరతు

జెరూసలెం, సెప్టెంబరు 1. ఈజిప్టు గనుక ఏ విధంగాను రేవుపై పోట్లాటకి దిగకుండావుంటే, తాముకూడా ఏ విధమైన తగాయిదాలను తెచ్చుకొట్టమని, ఈ పరతుపైన యుద్ధ విరమణకు అంగీకరిస్తామని ఇజ్రయిల్ సమితి పరిశీలకుడు ఎడ్సన్ బరన్స్‌కు తెలియజేసిందని విదేశాంగశాఖ ప్రతినిధి చెప్పాడు.

కాల్పుల విరమణకు ముందు తనపథకం అంగీకరించవలసిందిగా ఉభయులకు బరన్స్ నేడు తిరిగి మరో విజ్ఞప్తి చేశాడు.

### బ్రిటిష్ సామ్రాజ్యం

లండను, సెప్టెంబరు 1: గాజా సరి

## 'నయా పైసా' ప్రారంభం

### 1956 లో గాంధీ జయంతినుంచి

న్యూఢిల్లీ, సెప్టెంబరు 1. 1956 అంతంలో ఎప్పుడో ఒకప్పుడు దేశంలో దశాంశ పద్ధతి ద్రవ్యమానాన్ని ప్రవేశపెట్టవచ్చునని, బహుశా గాంధీజీ జన్మదినోత్సవం, అక్టోబరు 2 వ తేదీనాడు ప్రవేశపెట్టడం జరగవచ్చునని తెలియవస్తున్నది.

ఈ కొత్త దశాంశ పద్ధతిని ప్రవేశపెట్టిన వెంటనే పాత ద్రవ్యాన్ని తొలగించరు. కొంతకాలం అది గూడా చలామణీలో వుంటుంది ఇట్లా కొత్త, పాత ద్రవ్యాలు ఒక నాల్గు సంవత్సరాలు జంటగా అమలులో వుండవచ్చునని తెలుస్తున్నది.

కొత్త రూపాయి చిల్లరలో వందో భాగాన్ని ఇతరదేశాల్లోల్లాగా "సెంటు" అని పిలవడం తగదని అధికారవర్గాలవారు భావిస్తున్నారు. ఈ విషయమై అట్లా నిర్ణయంగూడా జరిగిందట: దీన్ని "నయా పైసా" అని పిలుస్తారట.

ఈ పద్ధతిని కొత్త ద్రవ్యమానం యీ విధంగా వుంటుంది. వీటికి నాణాలు వుంటాయి:

| | |
|---|---|
| 1 — | నయా పైసా |
| 2 — | రెండు పైసలు |
| 5 — | ఐదు పైసలు |
| 10 — | పది పైసలు |
| 25 — | పావలా |
| 50 — | అర్ధరూపాయి |
| 100 — | రూపాయి |

అంటే మొత్తం 7 నాణాలు చలామణీలోకి వస్తాయన్నమాట.

### నెహ్రూకు రష్యన్లు ఇచ్చిన గుర్రం

మాస్కో, సెప్టెంబరు 1: ఒక అరబ్ జాతి గుర్రాన్ని ప్రధాని శ్రీ నెహ్రూకు సోవియట్ వ్యవసాయ ప్రదర్శనసంఘం కానుకగా పంపారు. నిన్ననే ఒడెస్సా నుంచి ఒకనౌకలో దీనిని పంపారని మాస్కో రేడియో ప్రకటించింది. ఇటీవల రష్యావెళ్లినపుడు ప్రధాని శ్రీ నెహ్రూ ఈ అరబ్‌జాతి గుర్రాలను ఎంతో మెచ్చుకున్నారట.

## చట్టానికి ఆంధ్ర ప్రభుత్వ సవరణ

### బీడీలు, సిగిరెట్లు, ముడి పొగాకు మొదటి అమ్మకంపైనా పన్ను

కర్నూలు, సెప్టెంబరు 2: పూర్తి వ్యాపార మొత్తాన్ని లెఖ్కలోకి తీసుకొని అమ్మకం పన్ను మదింపుచేసి నికరంగా పన్ను మొత్తం తేల్చే లోపుగా అంటే జరుగుతూ ఉండే సంవత్సరం తాలూకు అమ్మకం పన్నును అందాజాగా ముందే మదింపుకట్టి వసూలుచేసే, అధికారం ప్రభుత్వానికి ఉండే లాగున, 1939 సంవత్సరపు మద్రాసు సాధారణ అమ్మకం పన్ను చట్టాన్ని ప్రభుత్వం సవరించదలచింది.

అందుకోసం, గెజెట్‌లో, ఒకబిల్లును ప్రభుత్వం ప్రకటించింది.

బిల్లును తయారుచేయడానికి గల కారణాలు ఆశయాలు అందులో యీ విధంగా తెలుపబడినవి.

చట్టంలో, ఏ సంవత్సరానికి ఆ సంవత్సరం మొత్తం అమ్మకాన్ని లెక్కలోకి తీసుకొని, వస్తువులపై ప్రభుత్వం పన్ను విధించడానికి అవకాశం కల్పించబడింది.

1939 సంవత్సరపు అమ్మకంపన్ను నిబంధనల ప్రకారం, ఆర్థిక సంవత్సరం పూర్తి అయ్యేలోపుగానే, ముందుగా, పన్ను వసూలుచేసే అవకాశం కల్పించబడింది. అయితే, అమ్మకంపన్ను ముందే వసూలుచేయడానికి ఖచ్చితమైన నిబంధనలేవీ అసలు చట్టంలో లేనందున ముందుగా పన్ను వసూలుచేయడానికి సంబంధించిన యీ నిబంధనలు, చెల్లవని మద్రాసు హైకోర్టు తీర్పు యిచ్చింది. కాబట్టి, ముందుగా అమ్మకంపన్ను మదింపుచేసి, వసూలుచేసే అధికారం ఉండేలాగున చట్టం సవరిస్తూ, స్పష్టమైన నిబంధనలు చట్టంలో పొందుపరచడం అవసరమని భావించబడింది. అసలు చట్టం ఏ తేదీనుంచి అమలులోకి వచ్చిందో, ఆ తేదీనుంచి యీ సవరణచట్టం వర్తించేలాగున చేయాలనే ఉద్దేశ్యం గూడా ఉన్నది. ఈ పై కారణాలవల్ల యీ బిల్లు సంకల్పించడమైనది.

### సిగరెట్లపైనా చుట్టలపైనా పన్ను

ఒక్కొక్కటి 3 పైసలకు తక్కువగా అమ్మే సిగరెట్లపైనా 2 అణాలకు తక్కువగా అమ్మే చుట్టలపైనా రూపాయికి 0-1-3 చొ॥న పన్ను విధించబడుతుంది.

వజ్రాలు, రత్నాలు మొదలైనవాటి అమ్మకంపై రూపాయి 1 కి 0-1-6 పన్ను విధించబడుతుంది.

### పొగాకు పన్నుగూడా ముందే వసూలు

1953 మద్రాసు పొగాకు (అమ్మకం పన్ను రిజిస్ట్రేషన్) చట్టాన్ని మరికొంత సవరించి, అందాజాగా వ్యాపారస్తుడు తెలియజేసే సంవత్సరం మొత్తం ఉపయోగించడానికి తయారుగా చేసిన (నస్యం, లింబాకు వగైరా) పొగాకుపైనా, అమ్మకంపన్ను విధించేందుకు, ప్రభుత్వం ఒక బిల్లు సంకల్పించి గెజెటులో ప్రకటించింది.

ముడిపొగాకుపైనగూడా రాష్ట్రంలోపల మొదటిసారి కొనుగోలుపై పన్ను విధించబడుతుంది. 1953 పొగాకు అమ్మకం చట్టాన్ని, 1953 సాధారణ అమ్మకంపన్నుచట్టాన్ని సవరించడంద్వారా యీ పన్నులు విధించబడతవి. బిల్లుకారణాలు ఆశయాలు యీ విధంగా తెలుపబడినవి.

ఈ రాష్ట్రంలోగూడా అమలునందున్న 1953 మద్రాసు పొగాకు (అమ్మకంపన్ను రిజిస్ట్రేషన్) చట్టం 4 (3) ఎ సెక్షన్ ప్రకారం ఒక్కొక్కటి మూడు పైసలకు అమ్మే సిగరెట్లపై అమ్మకం పన్ను విధించడంలేదు. ఆ సిగరెట్లపై గూడా పన్నువిధించాలని ప్రభుత్వం నిశ్చయించింది.

4 (3) బి సెక్షన్ ప్రకారం ఒక్కొక్కటి 2 అణాలకు తక్కువఅమ్మే దొరచుట్లపైనా, నాటుచుట్లపైనా పన్ను లేదు. వీటిపైనా, యితరవిధాలుగా ఉపయోగించడానికి తయారుచేసిన పొగాకుపైనగూడా ప్రభుత్వం, యీ రాష్ట్రంలో, మొదటిదఫాజరిగే అమ్మకంపైన పన్నువిధించాలని సంకల్పించింది.

రాష్ట్రంలో ముడిపొగాకు, మొదటి దఫా కొనుగోలుపైగూడా పన్నువిధించాలని సంకల్పించబడింది.

1955 లో మద్రాసు రాష్ట్రంలో అమలులోకివచ్చిన, మద్రాసు సాధారణ అమ్మకం పన్ను మద్రాసు పొగాకు (అమ్మకంపన్ను రిజిస్ట్రేషన్) సవరణచట్టాల ఫక్కీలోనే యీ బిల్లులు ఉన్నవి.

### మిల్లు బట్టలపై అదనపుపన్ను

రాష్ట్రాదాయాన్ని అభివృద్ధి చేయాలనే ఉద్దేశ్యంతో, మిల్లు బట్టలపైనా, సిల్కు వస్త్రాలపై అదనపు అమ్మకం పన్ను విధించాలని సంకల్పించి, ప్రభుత్వం ఒక బిల్లు ప్రకటించింది. ముతక సన్నంగాకుండా, ఒక మాదిరిగా ఉండే వస్త్రాలపైన, సన్న వస్త్రాలపైగా అతి సన్నమైన వస్త్రాలపైనా, సిల్కు వస్త్రాలపైనా వ్యాపారం ఆధారంవా పన్ను ముందుగానే మదింపు చేసి, వసూలుచేయడానికి ప్రభుత్వానికి అధికారం ఇచ్చేందుకు ఒక బిల్లును ప్రభుత్వం ప్రకటించింది. అసలు చట్టం ఏ తేదీన అమలులోకి వచ్చిందో, ఆ తేదీనుంచే ఈసవరణ చట్టం వర్తింప చేయబడుతుంది.

ఈ 4 బిల్లులు, రాష్ట్రాదాయాన్ని అభివృద్ధిచేయడానికి సంకల్పించినవే. ఇది వచ్చే శాసనసభలో ప్రతిపాదింపబడవచ్చునని తెలుస్తున్నది.

బొంబాయి, సెప్టెంబరు 1: భారత దేశం, ఆస్ట్రేలియాలమధ్య నడిచే నౌకల రవాణా రేట్లు అక్టోబరు 1 నుంచి నూటికి 10 వంతులు పెంచుతున్నారు.

## నూటికి 7 నుంచి 9 వంతులకు పన్నులవృద్ధి

### ద్వితీయప్రణాళికకు ధనం సమకూర్చే పద్ధతి వివరణ

న్యూఢిల్లీ, సెప్టెంబరు 1: దేశం పన్ను భారం ఇంకా చాలా భరించటానికి సిద్ధంగా వుండాలనీ, ప్రజలు పొదుపు చేసే మొత్తం బాగా హెచ్చుకపోతే పెద్ద యెత్తున ఆర్థికాభివృద్ధి దుర్ఘటమనీ భారత ప్లానింగుమంత్రి శ్రీ గుల్జారీలాల్ నందా అభిప్రాయపడ్డారు.

శని, ఆదివారాలలో జరగనున్న అఖిల భారత కాంగ్రెసుసంఘ సమావేశంలో ద్వితీయ పంచవర్ష ప్రణాళికపై చర్చ జరగనున్నది. ఆ చర్చను సులువు చేయటానికని శ్రీ నందా ఆ సంఘసభ్యులకు ప్రణాళికకు సంబంధించిన సంగతులు తెలియచేస్తూ ఒక పత్రం తయారు చేశారు.

అందులో ఇట్లావుంది. ద్వితీయ పంచవర్ష ప్రణాళిక స్థూల స్వరూపం తయారైంది. రూ 4300 కోట్లు ఖర్చు పెట్టి అభివృద్ధి కార్యక్రమం సాగించాలని నిర్ణయించుకొన్నాము. ఈ అయిదేండ్లలో జాతీయాదాయం ఎంత వృద్ధి కావాలో, ఉద్యోగావకాశాలు ఎంత పెరగాలో నిర్ణయించుకొన్నాము. కాని ఈ స్థూల స్వరూపంలోని అంశాలను తరచిచూస్తే ఫలితాలు మొదట అంచనా వేసినవాటికంటే తగ్గేటట్లు కనిపించేంది. ఎంత తగ్గుతాయీ అన్నది వీటిని తరచినకొద్దీ తెలుస్తుంది. అయితే ఈ లక్ష్యాలను తగ్గించటం మంచిదికాదు అందుచేత వచ్చేకొలది మాసాలలో వీటి విషయం బాగా ఆలోచించవలసివుంది.

### 7 వంతులనుంచి 9 వంతులకు పెరగాలి

ప్రణాళికకు కావలసిన పెట్టుబడి సందర్భంలో అదనపు పన్నులు, స్వల్ప మొత్తాల పొదుపు, ఋణాలు, ఇతర దేశాల సహాయం, జెయ్యికోట్లమేరకు లోటు ద్రవ్య విధానం అవలంబించటము -వీటన్నిటిద్వారాలభించేదానితో కలుపుకొని ఇంకా సుమారు రూ 800 కోట్లు లోటు వుంటుంది.

ఈలోటును భర్తీ చేయటానికి ఇంకా అదనపు పన్నులు వేయాలని వుద్దేశించబడింది.

ప్రస్తుతం దేశీయాదాయంలోపన్నుల రూపేణా వచ్చేది నూటికి ఏడువంతులు మాత్రమే. ఈ800 కోట్ల రూపాయలూ అదనపు పన్నుల ద్వారా సంపాదించాలంటే ఈ శాతం 9 కి పెరగవలసి వుంటుంది. అయితే ఈఅదనపు పన్ను భారం అందరిమీదా న్యాయంగా పడాలి. ముఖ్యంగా అభివృద్ధి కార్యక్రమాలవల్ల అదనపు ఆదాయం వస్తున్నవారు దానిని క్రమాభివృద్ధి నివృత్తిలో తిరిగి పెట్టుబడికి వినియోగించాలి.

నిరుద్యోగ నివారణసందర్భంలో రెండవ ప్రణాళిక కాలంలో 110 లక్షల ఉద్యోగావకాశాలు కలిగించాలని అనుకోబడింది. ఇదెంతవరకూ సాధ్యం కాగలదనేది కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు తయారుచేసిన కార్యక్రమాలను ముందుంచుకొని పరిశీలించబడుతోంది. అదీకాక ఈ ఉద్యోగావకాశాల విషయంలో స్థిరమైనవి, తాత్కాలికమైనవి రెండురకాల అవకాశాలు వుంటాయి. నిర్మాణాలు మొదలైనవాటిలో దొరికే వుద్యోగాలు తాత్కాలికమైనవి అంటే వాటిద్వారా మళ్లీ నిరుద్యోగులు ఏర్పడతారన్నమాట. అందుచేత ఈఅంచనాల విషయంలో చాలా జాగ్రత్తగా చూడాలి. నిరుద్యోగ నివారణకు చిన్న పరిశ్రమలలో ఉత్పత్తి పెరగటం అవసరం. ఆపరిశ్రమలకు దేశ ఆర్థికవ్యవస్థలో స్థిరమైన అంతర్భాగంగా ఎంచి అభివృద్ధి చేయాలి.

## మణిపూర్ మేజస్ట్రేట్ కు శిక్ష

### కోర్టుధిక్కార నేరం

ఇంఫాల్, ఆగస్టు 31: మణిపూరు రాష్ట్రం జుడీషియల్ కమిషనర్ శ్రీ బ్రిజ్ నారాయణ్, జిల్లా మేజస్ట్రేటు మేజర్ వి. ఎస్. సుందరంకు కోర్టు ధిక్కారణ నేరం చేసినందుకుగాను రూ. 50 జరిమానా విధించారు. మణిపూర్ రాష్ట్రం జైలు సూపరింటెండెంటును మందలించి వదిలిపెట్టారు.

మణిపూర్ ప్రజాసోషలిస్టు నాయకుడు శ్రీ అచ్చాసింగ్ దరఖాస్తును పురస్కరించుకొని వీరికి ఈ శిక్షలు పడ్డాయి. శ్రీ సింగ్‌ను ఏప్రెల్ 26 వ తేదీనాడు హెబియస్ కార్పస్ దరఖాస్తును బట్టి విడుదల చేయగా, అధికారులు తిరిగి ఆయనను మళ్లీ వెంటనే అరెస్టు చేసారు. ఇట్లు అరెస్టు చేయడం కోర్టును ధిక్కరించడమే అవుతుందని జుడీషియల్ కమిషనర్ నిర్ణయించి, ఈ అధికారులను పై విధంగా శిక్షించారు.

### సహజసంపదలశాఖ కార్యదర్శి

న్యూఢిల్లీ, సెప్టెంబరు 1. శ్రీ॥ శాంతిస్వరూప్ భట్నగర్ స్థానే ప్రస్తుతం జాయింటుకమిషనర్ గావున్న శ్రీ ఆర్, కే. రామధ్యానీని సహజసంపదలు, శాస్త్రపరిశోధనశాఖకు కార్యదర్శిగా నియమించారు. ఈయన నేడు తమ కొత్తపదవిని స్వీకరించారు.

ఉత్పత్తిశాఖలో బొగ్గుకు ప్రత్యేకంగా ఒక కార్యదర్శిని నియమించి దాన్ని ఒకశాఖగా ఏర్పాటుచేస్తారని తెలుస్తున్నది.

పఠాన్‌కోట, సెప్టెంబరు 1: రాష్ట్రపతి డా॥ రాజేంద్రప్రసాద్ ఈ నెల చివరివారంలో జమ్ము కాశ్మీర్ రాష్ట్రానికి వెడతారు. అక్కడ ఆయన రెండు వారాలు వుంటారని తెలుస్తున్నది.

## హైస్కూళ్లలో కళాశాలల్లో బోధనాభాషల వైరుధ్యం

### బొంబాయిలో విచారణ

బొంబాయి, సెప్టెంబరు 1: బొంబాయి నగరం, పరిసరాల్లో ఉన్న ఒక బొంబాయి విశ్వవిద్యాలయ అనుబంధ కళాశాలల్లో బోధన భాషగా దేనిని అనుసరించాలి అన్న విషయమై నిర్ణయించేందుకు కిందటి జూనులో విశ్వవిద్యాలయం ఏర్పాటు చేసిన ప్రత్యేక సంఘం ఎల్లుండి ఇక్కడ సమావేశమై నివేదికను తయారు చేయబోతున్నది.

హైస్కూళ్లలో ప్రాంతీయ భాషలోనే విద్యాబోధన జరుగుతున్నందువల్ల అక్కడనుంచి కాలేజీలకు వస్తున్న విద్యార్థులకు ఇంగ్లీషు భాషాజ్ఞానం చాలా తక్కువగా ఉన్నందువల్ల, ఇకమీద విశ్వవిద్యాలయ దిశలో ఇంగ్లీషులోనే బోధన సాగించటమా, మరొక భాషను ప్రవేశపెట్టటమా అన్న సందేహం విశ్వ విద్యాలయ సిండికేటుకు కలిగింది. దానిమీద ఈ సంఘాన్ని 22 మంది సభ్యులతో విశ్వవిద్యాలయఉపాధ్యక్షుడుగా ఏర్పాటు చేసింది.

ఐతే ఈ సంఘాన్ని ఏర్పాటుచేసేటప్పుడే విశ్వవిద్యాలయాధికారులుకొన్ని సూచనలుకూడా చేశారు. 10 సం॥వరకు కళాశాలల్లో ఇంగ్లీషులోనే బోధన సాగించి, తర్వాత హిందీని ప్రవేశపెట్టాలని వారు సూచించారు. అనుబంధ కళాశాలల్లో చాలావరకు ఇంగ్లీషుస్థానంలో హిందీని క్రమంగా ప్రవేశపెట్టటానికి సుముఖంగానే ఉన్నట్లు తెలుస్తున్నది.

ప్రాంతీయభాషలనుబోధనభాషగా అంగీకరించటానికి చాలా కళాశాలలు ఇష్టపడటంలేదని తెలుస్తున్నది. దీనికి కారణం బొంబాయి కళాశాల విద్యార్థుల్లో అధికభాగం బహుభాషా ప్రాంతాలకు చెందినవాళ్ళు కావటమే.

## మధ్యతరగతి ప్రజల గృహ నిర్మాణాలు

### మనిషికి రూ 25 వేలవరకు అప్పు ఇవ్వాలని ఆలోచన

న్యూఢిల్లీ, సెప్టెంబర్ 1: మధ్యతరగతి ప్రజలు ఇళ్లుకట్టుకునేందుకు సహాయంచేసేనిమిత్తం కేంద్రప్రభుత్వం ఒక పథకం ఆలోచిస్తున్నది. దీనికింద మనిషికి 25 వేలవరకూ అప్పు ఇవ్వాలని స్థూలంగా ప్రతిపాదించబడ్డది. ఇన్సూరెన్సుకంపెనీల సహకారంతో ఈ పథకాన్ని నిర్వహించాలని కేంద్రప్రభుత్వ ఉద్దేశ్యం.

గృహవసతి, నిర్మాణశాఖల మంత్రి సర్దార్ స్వరణ్ సింగ్ నేడు లోక్‌సభలో ఒక ప్రశ్నకు జవాబిస్తూ ఈ విషయాన్ని వెల్లడించారు. ఈ విషయమై చాలా ఇన్సూరెన్సుకంపెనీలను సంప్రదించటం జరిగిందనీ, పథకాన్ని అమలు జరిపేందుకు నియమాలను తయారుచేసే నిమిత్తం ఆ కంపెనీల జవాబులు ప్రస్తుతం పరిశీలించబడుతున్నవనీ ఆయన వివరించారు.

ఈ పథకంలోఉన్న ఇతర ముఖ్యాంశాలివి:

(1) మామూలుగా అయితే, ఇంతకు ముందు ఒక ఇల్లుఉన్న వ్యక్తికిగానీ, కట్టిన ఇల్లును కొనదలచుకున్న వాళ్లకుగానీ అప్పుఇవ్వబడదు.

(2) అప్పుదరఖాస్తులనుఒకఇన్సూరెన్సు కంపెనీ, ప్రభుత్వము కలిసి ఆమోదిస్తవి అప్పులో మూడవవంతుల్ని కంపెనీ, ఒకవంతును ప్రభుత్వం ఇస్తవి. ఇంటిస్థలంతోపాటు మొత్తంఅయ్యే ఖరీదులో 80 % కి మించి అప్పుఎప్పుడూ ఇవ్వబడదు.

(3) ఇట్లాఇచ్చిన ప్రతిఅప్పునూ సమానమయిన సంవత్సర వాయిదాల్లో చెల్లించాలి. అది

(5 వ పేజీ తరువాయి)

## నందికొండ శంకుస్థాపన

### డిశెంబర్ రెండవ పక్షంలో జరుప శ్రీ నెహ్రూ అంగీకారం

కర్నూలు, సెప్టెంబరు 2: డిశెంబరునెల రెండవ పక్షంలో, అయితట్లయితే నందికొండ ప్రాజెక్టుకు శంకుస్థాపన చేయడానికి అంగీకరిస్తు భారత ప్రధానమంత్రి శ్రీ పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ ఆంధ్రప్రభుత్వానికి వ్రాసినట్లు తెలిసింది.

నందికొండ డాము ప్రాంతంవద్ద డేరాలు నిర్మించడానికిగాను, ఆంధ్ర ప్రభుత్వం రు. 40 వేలు మంజూరు చేసినట్లుకూడా తెలుస్తున్నది. సిబ్బందివసతికి కట్టవలసిన, యిళ్ల ప్లానులు, ఆంధ్ర హైదరాబాదు ప్రభుత్వాల వస్తుశాస్త్రజ్ఞులిద్దరూ తయారు చేస్తున్నారు. (స్వ. వి.)

## మలయా మదులుకోడం బ్రిటన్‌కు ఇష్టంలేదు

### వలసచర్యల మంత్రి వెల్లడి

కౌలాలంపూర్, సెప్టెంబరు 1: మలయా అంతరంగిక భద్రత విషయమై మలయన్లకు అధికార మివ్వడానికి బ్రిటన్ అంగీకరించదని వలస శాఖా మంత్రి అలాన్ లెనాక్స్ బాయిడ్ నేడిక్కడ విలేఖరులతో అన్నారు.

"తమ బాధ్యతలు సక్రమంగా వారు నిర్వహించగలరని మాకు నమ్మకం, తృప్తి కలిగేవరకు యీ ప్రసక్తేలేదు" అని స్పష్టం చేశారు. ఈయన మలయా స్వాతంత్ర్య సమస్యగురించి మలయన్ ప్రభుత్వనాయకులతో సంప్రతింపులు జరిపాడు. రేపు సింగపూరు వెడుతున్నాడు.

[అంతరంగిక భద్రత, ఆర్థిక శాఖ యీ రెండింటిపై పెత్తనం లేకపోతే అధికారంలో వుండి ప్రయోజనం లేదని మలయా ప్రధాని తెంగ్‌కూ రహిమాన్ నిన్న శాసనసభను ప్రారంభిస్తూ అన్నాడు.]

స్వాతంత్ర్యానికి గడువు నిర్ణయించడం మంచిదికాదని బాయిడ్ అన్నాడు. మలయన్ ప్రతినిధివర్గం త్వరలో బ్రిటన్ వెడుతుంది.

### రష్యాచే కొందరు జపాన్ ఖైదీల విడుదల

మాస్కో, సెప్టెంబరు 1: 35 మంది జపానీస్ యుద్ధ ఖయిదీలను రష్యానిన్న విడుదల చేసింది. వీరందరు ఒక జపానీస్ రెడ్ క్రాసు తరలింపు నౌకలో బయలుదేరారు. సోవియట్ ప్రభుత్వం విడుదలచేసిన జపానీస్ యుద్ధ ఖయిదీల జట్లలో ఇది నాలుగవది.

### సైగాన్‌లో శరణార్థుల నౌకపైగూడా కాల్పులు

సైగాన్, సెప్టెంబరు 1: బిన్ జుయెన్ తిరుగుబాటుదారులు నిన్న ఒక శరణార్థుల నౌకపై సైగాన్ నది ఎగువన శతఘ్నులు పేల్చారు దీని ఫలితంగా 17 మంది చనిపోయారు. 40 మంది గాయపడ్డారు.

# రైల్వే సామగ్రి తయారీ కొనుగోలులలో అక్రమాలు

## నిర్ణీత కార్యక్రమం ప్రకారం పని సాగాలని మందలింపు

## తప్పులు చేసేవారిని తీవ్రంగా శిక్షించాలని పద్దుల పరిశీలకుల నివేదిక

న్యూఢిల్లీ, ఆగస్టు 31 : రైలుఇంజన్లు వగైరా తయారుచేసే టాటా ఇంజనీరింగు కంపెనీవారు ఒకటి తయారు చేయుటానికిబదులు ఇంకొకటి తయారుచేయుడంవల్ల భారత రైల్వేలకు కావలసిన రైలు ఇంజన్లు, బాయిలర్ల ఉత్పత్తిలో స్వయం సమృద్ధి సాధించటం వెనకబడిందని పబ్లిక్ అక్కౌంట్స్ కమిటీవారు అభిప్రాయపడ్డారు.

ఈ కమిటీవారి 18-వ నివేదిక నేడు పార్లమెంటు ఉభయ సభలకూ అందచేయబడింది.

టాటా కంపెనీలో అమలులో వున్న ఉత్పత్తి ఖర్చుల అంచనా పదతిని గురించీ, ఈ కంపెనీ 'తయారీ' లో దేశీయ సామగ్రి ఎంతవరకూ వినియోగమవుతున్నదీ అన్న విషయం గురించీ పరిశీలించటానికి రైల్వే బోర్డు ఒక వేత్తల సంఘాన్ని నియమించాలని కమిటీ సూచించారు.

ఈ కంపెనీ ట్రక్కుల తయారు మొదలైనవి కూడా చేస్తున్నది. రైల్వేల నిమిత్తం జరగవలసిన పని జరగకుండా వ్యాపారం నిమిత్తం చేసే ఈ పనుల వల్ల ఆటంకం కలుగుతున్నదీ లేనిదీ వేత్తల సంఘం పరిశీలించాలి ఈ పనులవల్ల, ఒప్పందంలో నిర్ణీతమైన గడువు ప్రకారం బాయిలర్లు, ఇంజన్లు తయారు చేయటానికి అవరోధ మేర్పడుతోందా లేదా, ఏర్పడితే ఏ మాత్రం? యంత్రాలను ఎంతెంతసేపు పూరిగా వుంచుతున్నారు? ఇదికూడా ఆ వేత్తల సంఘం పరిశీలించాలి.

### సామగ్రి సరిగా లేదు: ఆలస్యాలు కూడాను

రైల్వేబోర్డువారు సమర్పించిన విజ్ఞపికలో బాయిలర్లు, ఇంజన్ల తయారు ఆలస్యం అయినందువల్ల ప్రభుత్వం ఎక్కువ ధర ఇచ్చుకోవలసి వస్తోందని తెలిపి వున్నారు. రైల్వేబోర్డు ఈ సందర్భంలో ఎంత నష్టం వచ్చిందో లెక్కవేయించి, దానిని కంపెనీనుంచి రాబట్టటానికి ఏమిచేయ తలుస్తున్నారో ఈ సంఘానికి తెలియచేయాలి.

రైల్వేబోర్డువారు ధాన్యపు కొట్ల వ్యవస్థను ఎత్తివేసే విషయమై గట్టిగా ఆలోచించాలి. ఈ వ్యవస్థవు ఇప్పటికే చాలా నష్టం కలిగించింది. అదీ కాక సిబ్బందిలో చాలామంది డబ్బు యూనియన్ కరువుభత్యమే కోరి తీసుకొంటున్నారు. కనక ఇకముందు ఇంకా నష్టం కలగకుండా ఈ ధాన్యపుకొట్లను ఎత్తివేయటం మంచిది. కెనడానుంచి తెప్పించుకొన్న చమురు పీపా వాగన్లు రావలసినదానికంటే ఆలస్యంగా వచ్చినందున కలిగిన నష్టాన్ని ఆ కెనడా కంపెనీనుంచి రాబట్టే విషయంలో ప్రయత్నమేమీ జరగలేదు. ఇందుకు బాధ్యులయినవా రెవరో తెలుసుకోవాలని ఈ సంఘం ప్రయత్నించింది. ఈ సందర్భంలో రైల్వేబోర్డు వ్యవహరించిన తీరు చాలా అసంతృప్తిగా వుంది.

ఇట్లాగే వాషింగ్టన్లోని భారత సరఫరా సంఘంవారుకొన్న రైలుబద్దీలు లోపభూయిష్టాలైపనికిరాకుండాపోయాయి. ఈ విషయంలో ఆ సంఘం వ్యవహరించిన తీరు కూడా ఏమీ బాగా లేదు మనదేశం వచ్చాక ఆ బద్దీలు పనికిరావని తేలితే ఆ నష్టాన్ని భరించవలసిన బాధ్యత అమ్మిన కంపెనీపై వుంటుందని ఒప్పందంలో వున్నప్పటికీ అవిషయం ఆ కంపెనీకి తెలియబరచటంలో ఆలస్యం జరిగింది. ఇట్లా ఎందుకు జరిగిందో, ఇందుకు బాధ్యులెవరో వారిపై ఏమిచర్య తీసుకొన్నారో తెలియలేదు. ఈ రైలుబద్దీల కొనుగోలు వ్యవహారంగురించి వివరమైన దర్యాప్తు జరగవలసివుంది. ఈ వ్యవహారం ఆద్యంతం వాషింగ్టన్లోని మన సరఫరాసంఘం సరిగ్గా పనిచేయటంలేదని వ్యక్తం చేస్తున్నది.

### పనికిరాని సామాన్లు సేకరించరాదు

టెండర్లు పిలవటంలో రైల్వే అధికారులు నిర్దిష్టమైన పద్ధతిని తు. చ. తప్పకుండా అనుసరించేటట్లు రైల్వే బోర్డు స్పష్టంగా ఉత్తరువులు చేయాలి. అదనపు సామాన్లు, పనికిరాని సామాన్లు క్రమంగా తగ్గిపోయేటట్లు రైల్వేబోర్డువారు నిరంతర శ్రద్ధ వహించాలి. ఈ విషయంలో వచ్చేయేడాది, ఆడిట్ రిపోర్టు మెరుగుగా వుంటుందని ఆశిస్తున్నాము అని ఈ సంఘం ఈ నివేదికలో పేర్కొన్నారు.

వీరు తంతితపాలాశాఖ పనిచేస్తున్న విధం గురించి కూడా నివేదిక సమర్పించారు. అందులో ఆలీపూర్ లోనితంతితపాలాశాఖ వర్కుషాపులో కనిపించిన పరిస్థితులపట్లా, ప్రస్తుతం అక్కడ అమలులోవున్న లెక్కలుకట్టే పద్ధతిపట్లా అసంతృప్తి వెల్లడించారు చేసిన ఖర్చుకు తగ్గట్లుగా ఉత్పత్తి జరిగిందీ లేనిదీ కను గొనటం అక్కడి లెక్కల పద్ధతినిబట్టి అసాధ్యంగా వున్నదనీ, తగు చర్యలు తీసుకొంటే అక్కడ ఉత్పత్తి 36% పెరగగలదనీ అభిప్రాయపడ్డారు.

### నిర్ణయ ప్రకారం ధనవినియోగం

ఈ శాఖ ఖర్చును బడ్జెట్ లో ఏర్పాటు చేసిన దానికి పరిమితం చేసుకోవటం, అవసరమైనప్పుడు డబ్బు నిబంధనల ననుసరించి సకాలంలో తీసుకోవటం వాంఛనీయ మన్నారు. అట్లాకాక అదనపు ఖర్చులు అధికారం పొందకుండా చేయటం అక్రమమన్నారు. ఈ శాఖ ప్రారంభ లెక్కలు సక్రమంగా లేవనీ, ఎప్పటికప్పుడు పూర్తిగా లేవనీ ఈ లోపాన్ని సవరించటం అవసరమనీ కూడా అన్నారు.

శిక్షణ చర్య తీసుకోవలసిన సందర్భాలలో ఇప్పుడు క్రిమినల్ శాసనం ప్రసక్తి వచ్చినప్పుడు దాని ఫలితం తేలేవరకూ శాఖకు సంబంధించిన వ్యవహారం ఆపివేయటం జరుగుతున్నదనీ, ఈ పద్ధతి మార్చివేసి ముందుశాఖకు సంబంధించిన విచారణ జరిగి శిక్ష విధించబడిన తర్వాత క్రిమినల్ కోర్టు వ్యవహారం జరిగేటట్లు చేయాలనీ అభిప్రాయపడ్డారు. డబ్బుకు లెక్కలకూ సంబంధించి నిర్దిష్టమైన నిబంధనలను తీవ్రంగా ఉల్లంఘించిన సందర్భాలలో తీవ్రచర్యలు తీసుకోవాలని సూచించారు.

### తపాలా బీమా ఏర్పాటు

తపాలాశాఖ జీవితబీమానిధి సరియైన వ్యాపారపద్ధతులలో జరిగేటట్లు చేయాలని ఇదివరలో తాము చేసిన సూచనపై త్వరలో నిర్ణయంచేయాలనీ, ఈ నిధి ప్రధానాధికారిగా బీమా వ్యవహారాలలో నిపుణతలయినవానిని నియమించటమో లేక పార్లమెంటు శాసనాన్ని ననుసరించి యేర్పడే సంస్థద్వారాదీనిని నిర్వహించటమో జరగాలని సూచించారు.

చెల్లించకుండా మిగిలిపోయిన టెలిఫోన్ బిల్లులను వసూలు చేయటానికీ, అవి పెరగకుండా చేయటానికీ ఏదో ఒక ఏర్పాటు చేయాలని సూచించారు.

# గోవాపట్ల ప్రభుత్వ విధానం

## కాంగ్రెసు అధ్యక్షులసభలో నెహ్రూ సమర్థన

న్యూఢిల్లీ, సెప్టెంబర్ 1: గోవా సమస్యపట్ల భారత ప్రభుత్వం, కాంగ్రెస్ అనుసరిస్తున్న విధానం ప్రపంచ వ్యవహారాలపట్ల మనం ప్రాతిపదికగా అనుసరిస్తున్న శాంతియుత విధానానికి అనుగుణంగా ఉన్నది. మరేమార్గాన్ని అనుసరించినా, అది ఇప్పుడు ప్రపంచంలో నెలకొన్న శాంతి వాతావరణానికి విరుద్ధంగా ఉంటుంది" అని ప్రధాని నెహ్రూ నేడిక్కడ రాష్ట్ర కాంగ్రెసు అధ్యక్షుల కార్యదర్శుల సమావేశంలో ప్రసంగిస్తూ ఉద్ఘాటించారు.

"భారతదేశం ఎల్లప్పుడూ సంప్రదింపులద్వారానే సమస్యలను పరిష్కరించుకోవాలని అంటుందే కాని యుద్ధాలవల్ల పరిష్కరించుకోవాలనదు. ఈ విధానాన్ని అగ్రరాజ్యాలు గుర్తిస్తున్నందుకు ఎంతో సంతోషం. సమస్యా పరిష్కారానికి యుద్ధాలు పనికిరావని ఇప్పుడు గుర్తించినంతగా మరెన్నడూ అగ్రరాజ్యాలు గుర్తించలేదు. ఈ శాంతి వాతావరణాన్ని సృష్టించటానికి భారతదేశంకూడా తోడ్పడ్డది." అని ఆయన వివరించారు.

### భారీ సత్యాగ్రహం పనికిరాదు

బొంబాయి, సెప్టెంబరు 1: ఆగస్టు 15 తే జరిగిన సంఘటనల దృష్ట్యా, గోవాపైకి భారీ ఎత్తున జైత్రయాత్ర చేసే పద్ధతి బదులు ఇటుపై చిన్న చిన్న దళాలను పంపడం ప్రయోజనకరం కాగలదని గోమంతక్ దళ కార్యవర్గం భావిస్తున్నది. చిన్న దళాలను పంపితే సత్యాగ్రహులు గోవా మధ్యప్రాంతాలకుకూడా చొచ్చుకు పోవటానికి సాధ్యం అవుతుందని వీరు అభిప్రాయపడుతున్నారు.

నిన్న రాత్రి జరిగిన సమావేశంలో గోవా విషయంలో భారత ప్రభుత్వం అవలంబించిన విధానం పట్ల ఈ దళం విశ్వాసం ప్రకటించింది. కాండుంగ్ సభ రాజ్యాలన్నీ, గోవాపై దిగ్బంధం విధించడంలో భారత ప్రభుత్వానికి సహకరిస్తే ఉద్యమం అచిర కాలంలోనే జయప్రదం కాగలదన్న విశ్వాసం వెలిబుచ్చుతూ మరొక తీర్మానం చేశారు. ఈ విషయంలో బర్మా, సింహళం, సైనా, ఇండోనీషియా, ఈజిప్టు ప్రభుత్వాలు అవలంబించిన వైఖరిని హర్షిస్తూ, మిగతా దేశాలు ముఖ్యంగా పాకిస్థాన్ కూడా ఈపద్ధతిని అవలంబించి భారత ప్రభుత్వాన్ని బలపరచాలని విజ్ఞప్తిచేశారు.

### గోవాకు చిలకలూరుపేట దళం

చిలకలూరిపేట, ఆగస్టు 30: గోవాలో సత్యాగ్రహం చేయడానికి, యిక్కడినుంచి, 5గురు, జట్టుగా, 28వ తేదీ సాయంకాలం బయలుదేరివెళ్ళారు.

వెళ్ళేముందు, ప్రజలు వారికి పూలమాలలు వేసి, బస్సుస్టాండు దాకా సాగనంపారు. ఈ జట్టులోఉన్న ఐదుగురు: అంబటి అంజనేయులు, దుర్గాసింగు, తవ్వా నాగేంద్రము, కుప్పా వెంకటస్వామి, బోసం కృష్ణమూర్తి. స్వ. వి.

### పశ్చిమ గోదావరిలో భూదానాలు

కొవ్వూరు, ఆగస్టు 31 : కొవ్వూరు తాలూకా లక్కవరం గ్రామంనించి ప్రారంభమైన పశ్చిమ గోదావరి జిల్లా భూదాన యాత్రలో అల్లూరి బాపినీడు టి. వి. రాఘవులు, పుసులూరి కోదండరామయ్య, ప్రత్తి శేషయ్య ప్రభృతులు పాల్గొన్నారు. బాగులక్కవరం, పంగిడిగూడెం గ్రామాలలో పలువురు భూదానోద్యమానికి భూమిదానం చేశారు. అణె అప్పల సుబ్బారావుగారు 5 ఎకరాలు, మహంకాళి రుక్కయ్యగారు 2 ఎకరాలు ఇచ్చారు. దొడ్ల పల్లంరాజు, నరసింహరాజు, రామభద్రరాజు గార్లు ఒక్కొక్క ఎకరం ఇచ్చారు. ఒక హరిజనుడు ఒక ఎకరం ఇచ్చాడు.

# ప్రభుత్వ నివేశనాలు

## పరిశీలనసంఘనివేదిక

న్యూఢిల్లీ, ఆగస్టు 31. ప్రభుత్వనివేశనాల ఉద్వాసన సవరణచట్టాన్ని పరిశీలించేందుకు నియమింపబడిన పరిశీలన సంఘం దానిలో ఏ మార్పులూ చేయకుండానే ఆమోదించి తిరిగి లోక్ సభకు పంపారు. ఆ సంఘ అధ్యక్షుడు శ్రీ కె. రఘురామయ్య ఇవ్వాళ తమ నివేదికను లోక్ సభకు అందచేశారు. శ్రీమతి రేణూ చక్రవర్తిమాత్రం ఈ నివేదికకు తమ విప్రతిపత్తి అభిప్రాయం వెలడించారు. ఈ సంఘం 1954 డిసెంబరు 5 లోగానే ఈ నివేదికను సమర్పించవలసిందికాని, మూడుసార్లుగడువు పొడిగించ బడింది.

సవరణచట్టం వుద్దేశం అసలు శాసనంలోని నిబంధనలను మరిన్ని ఎక్కువ రకాల నివేశనాలకు వర్తింపచేయటం, 'ప్రభుత్వ నివేశనాలు' అన్న పదంలో వ్యవహరించే పేటలో ప్రభుత్వానికి చెందినవి. లేక అద్దెకు తీసుకొన్నవి లేక స్వాధీనం చేసుకొన్నవి వున్నవి.

ఈ చట్టాన్ని పరిశీలన సంఘానికి పంపాలన్నప్పుడు చాలామంది సభ్యులు ఇది శాసనమైతే చాలామంది కొందికులు ప్రస్తుతం వుంటున్న ఇళ్ళలోనుంచి లేచిపోవలసి వస్తుందనిఅన్నారు.

శ్రీమతి రేణూచక్రవర్తి తన భిన్నాభిప్రాయప్రకటనలో ప్రభుత్వం ఈ చట్టాన్ని వుపసంహరించివేయాలనీ, దీనికిబదులు ఒక కేంద్ర అభివృద్ధి అధికారసంస్థను నెలకొల్పే శాసనం తేవాలనీ, ఆ సంస్థవిధానం అధికారాలు, పని పార్లమెంటు ఆమోదానికి లోబడి వుండాలనీ అన్నారు.

### ఆదాయపుపన్ను శాఖ ఉద్యోగుల జీతాలు

విజయవాడ, ఆగస్టు 30: 'పైతరగతి ప్రమోషనుకు తగిన అర్హతలు కలిగి ఉంటే ఆదాయపు పన్ను వసూలు శాఖలో మూడవ తరగతి ఉద్యోగాలలో ఉన్నవారికి ప్రస్తుతం రెండు ఇంక్రిమెంట్లు లభించుతవి అని ఆంధ్ర హైదరాబాదుల ఆదాయపు పన్ను వసూలుశాఖ కమిషనరు శ్రీ యస్. డి. మిశ్రా 29 వ తేదీ సాయంత్రం ఆదాయ పన్నుశాఖ మూడవ తరగతి ఉద్యోగుల ద్వితీయ వార్షికోత్సవసభ ప్రారంభిస్తూ అన్నారు.

'ఏ తరగతి ఉద్యోగులు ఎంతెంత పని చేయగలరు' అనే విషయం కూలంకషంగా పరిశీలించి నివేదించడానికి ఒక ఉపసంఘం ఏర్పాటు చెయ్యబడినదనీ, దీనిలో కొందరు నాన్ గెజెటెడ్ ఉద్యోగులుకూడా ఉన్నారనీ ఈ సంఘం అప్పుడే పని ప్రారంభించినదనీ శ్రీ మిశ్రా వెల్లడించారు.

### బ్యాంకుఉద్యోగుల కేంద్రసంఘం

కలకత్తా, ఆగస్టు 31 : బ్యాంకు ఉద్యోగుల వుద్యోగ నియమాల విషయమై గజేంద్రగడ్కర్ చేసిన సిఫార్సులను చర్చించటానికి అఖిల భారత బ్యాంకు ఉద్యోగుల సంఘ కేంద్ర సంఘం సెప్టెంబరు మొదటివారంలో ఢిల్లీలో సమావేశమవుతుంది.

ఉద్యోగులసంఘ కార్యదర్శి ప్రభాకర్ కార్ ఈఅంశాన్ని వెల్లడిస్తూ గజేంద్రగడ్కర్ సిఫార్సులన్నిటినీ ఆమోదించవలసిందిగా భారత ప్రభుత్వానికి విజ్ఞప్తిచేశారు.

# పురపాలక సంఘం ఎన్నికలు

## ఇప్పుడున్న వార్డుల ప్రకారమే జరుగుతవి

కర్నూలు, సెప్టెంబరు 1. ఈ సంవత్సరం, నవంబరు, డిసెంబరు నెలల్లో జరిగే పురపాలక సంఘాల ఎన్నికలు ప్రస్తుతం ఉన్న వార్డుల ప్రకారమే జరుగుతవని, స్థానిక సంస్థల పరిపాలనా మంత్రి డా॥ నాగేశ్వరరావుగారు యినాళ చెప్పారు.

కొత్తప్రాంతాలు చేర్పడంవల్ల ఒకటి రెండు పురపాలక సంఘాల వార్డుల పునర్విభజన అవసరమైందని వాటిల్లో మాత్రము కొత్తవార్డుల ప్రకారం ఎన్నికలు జరుగుతవని తెలియచేశారు.

ఓటర్ల జాబితాల సవరణకు వీలుగానే, పురపాలక సంఘాల ఎన్నికలు అక్టోబరు దాకా వాయిదా వేయడం జరిగిందని, లేక జూలై-ఆగస్టు, సెప్టెంబరు నెలల్లోనే జరిగి ఉండేవని అన్నారు

చాలా పురపాలక సంఘాలలో వార్డుల పునర్విభజన అవసరంగా ఉన్నప్పటికీ, ఆ పని పూర్తిచేయడానికి చాలా వ్యవధి పడుతుంది గనుక, యిప్పుడున్న వార్డుల ప్రకారమే జరుపుటకు నిశ్చయించామని నాగేశ్వరరావుగారు చెప్పారు.

### అభ్యర్థులకు గుర్తుల కేటాయింపు

కర్నూలు, సెప్టెంబరు 1 : పురపాలక సంఘాలకు జరగనున్న ఎన్నికలలో అభ్యర్థులకు 'ఎన్నికల గుర్తుల'ను కేటాయించే పద్ధతిని గురించి ఆంధ్ర ప్రభుత్వం ఈ దిగువ సూచనలు నిర్ణయించారు. ఇప్పటి ఈ వుత్తరువుల పర్యవసానంగా యీ విషయం గురించి ప్రభుత్వం ఇంతకు ముందుచేసిన నిర్ణయాలన్నీ రద్దు అవుతవి.

ఆయా పార్టీలకు రెన్నికల కమిషను కేటాయించిన ఎన్నికల గుర్తుల వివరాలివి :కాంగ్రెసుపార్టీ-కాడినిమోస్తున్న రెండుగిత్తలు; ప్రజా సోషలిస్టు పార్టీ-గుడిసె; కమ్యూనిస్టు పార్టీ-కొడవలి-కంకి; భారతీయ జనసంఘం-దీపం; కృషికార్ లోక్ పార్టీ - ధాన్యం తూర్పారపడుతున్న రైతు; ప్రజాపార్టీ ఉదయిస్తున్న సూర్యుడు; మిగతా పార్టీలకూ కేటాయించడానికి ఉన్న గుర్తులివి . చెట్టు; నుంచున్న సింహం; చూసవునిహస్తం; గుర్రము-రౌతు;కోడి; ఏనుగు; పార; త్రోవ్వపార; జ్యోతి; సైకిలు; బండి; బూజా; నిచ్చెన; విల్లు-బాణం; పతత్రం; పడవ; పువ్వు; ఒంటె; త్రాసు; రెండు ఆకులు-రెమ్మ.

ఈ గుర్తులన్నింటినీ కేటాయించినా ఇంకా యెన్నికల గుర్తులు ఇవ్వవలసిన పరిస్థితి ఏర్పడితే రాష్ట్ర ప్రభుత్వాన్ని సంప్రదించి స్థానిక సంస్థల ఇన్స్పెక్టరు జనరల్ ఇతర గుర్తులను నిర్ణయిస్తారు.

ఇంతకుపూర్వం జరిగిన రాష్ట్రశాసన సభ ఎన్నికలలో ఆయాపార్టీలకు నిర్దేశించబడిన ఎన్నికల గుర్తులనే ఎన్నికోద్యోగులు కేటాయిస్తారు.

ఆయాపట్టణాలలో పనిచేస్తే పార్టీల అధికారఅభ్యర్థుల ఎన్నికలగుర్తులను ఎన్నికోద్యోగియే నిర్ణయిస్తారు. స్వతంత్రఅభ్యర్థులకు పైన వివరించబడిన జాబితాలోని గుర్తులను కేటాయిస్తారు. ఒక పురపాలకసంఘంలో ఒక పార్టీకి ఒక ఎన్నికలగుర్తు కేటాయించినంత మాత్రాన అదేగుర్తును మరొక పురపాలక సంఘంలో మరొకపార్టీకి ఇవ్వరాదన్న నిషేధమేమీఉండదు. ఒకవేళ ఒకపార్టీ ఒక పురపాలకసంఘంలోని కొన్ని వార్డులకుమాత్రమే అభ్యర్థులను నిలబెడితే, ఆ పార్టీకి కేటాయించిన ఎన్నికలగుర్తును అదే పురపాలకసంఘంలో మరొకవార్డులో వేరొకపార్టీకిమాత్రం కేటాయించరు. ఒక పురపాలక సంఘంలోని ఒక వార్డులో ఒక స్వతంత్ర అభ్యర్థికి కేటాయించిన ఎన్నికల గుర్తును అదే పురపాలకసంఘంలో వేరొక స్వతంత్రఅభ్యర్థికి కేటాయించరాదన్న నిషేధమేమీ లేదు.

ఒకేఒక ఎన్నికలగుర్తు తమకుకావాలంటే తమకుకావాలని ఏ రెండుపార్టీలైనా లేక ఏ ఇద్దరు స్వతంత్ర అభ్యర్థులైనా కోరితే ఎన్నికోద్యోగి లాటరీ ద్వారా ఆ గుర్తు ఎవరికి కేటాయించవలసినది నిర్ణయిస్తారు.

ఇట్లా ఎన్నికల గుర్తులను నిర్ణయించే సందర్భంలో ఒకవేళ ఏపార్టీ గాని లేక అభ్యర్థి గాని అసలు ఎన్నికలగుర్తే లభించకపోతే ఎన్నికోద్యోగి నిర్ణయించే గుర్తు నే వారు తీసుకోవాలి. ఈ వ్యవహారంలోఎన్నికోద్యోగిదేతుదినిర్ణయం.

ఒక అభ్యర్థి ప్రభుత్వం గుర్తించిన పార్టీకి చెందినవాడా, లేక స్వతంత్ర అభ్యర్థియా అనే వివాదం వచ్చిన సందర్భంలో ఎన్నికోద్యోగిదే తుది నిర్ణయాధికారం.

ఒకవేళ ఏదైనా ఒక పార్టీలో ఒకే స్థానానికి ఒక పార్టీ గుర్తించిన ఇద్దరు అంతకంటే ఎక్కువ మంది అభ్యర్థులు పోటీ చేయడం జరిగితే, వారందరూ అంగీకరించినట్లయితే, వారిలో ఒకరిని పార్టీ అభ్యర్థిగానూ మిగిలిన వారిని స్వతంత్ర అభ్యర్థులు గానూ పరిగణించవచ్చు అట్లా అంగీకారం కుదరకపోతే రెన్నికోద్యోగి లాటరీవేసి నిర్ణయిస్తారు.

న్యూఢిల్లీ, సెప్టెంబరు 1: సైనాకు ఎగుమతి చేయడానికి 40 వేల బేళ్ళ ప్రత్తిని కేంద్రప్రభుత్వం విడుదలచేసినట్లు వాణిజ్యమంత్రి శ్రీ కరమార్కర్ నేడు లోక్ సభలో వెల్లడించారు.

# ఆకాశవాణి

ఆదివారం, సెప్టెంబరు 4

## విజయవాడ

ఉ॥ 6-50 స్వాగతం 6-55 ప్రసార విశేషాలు 7 తెలుగున వా. 7-15 మదరాసు బి. వలె 7-30 మద్రాసు ఎ. వలె 8 అం. వా.

మ॥ 1 మద్రాసు వలె 1-30 ఎ. వలె 1-40 హిందీ వా. 1-50 తెలుగున వా. 4 బొమ్మరిల్లు.

సా॥ 5-30 టి. ఆదినారాయణ క్లారినెట్ 6 గీతావళి-పెండ్యాల విశ్వేశ్వరరావు 6-15 ప్రాంతీయ వా. 6-25 స్థానిక ప్రకటనలు 6-30 గ్రామ కార్యక్రమం విరేశలింగం (బుర్రకథ) 7 తెలుగున వా. 7-15 దాదాభాయ్ నౌరోజీ (ప్రసంగం) 7-30 మాళవికారాయ్ (స్టూ రి.) 8 బెజవాడ వినాయకం పువాదరి 8-30 పరిషత్ యుగళం-నిలయవిద్వాంసులు 8-54 ఢిల్లీవలె 9 అం. వా. 9-15 గీతావళి పెండ్యాల విశ్వేశ్వరరావు 9-30 రసమయ స్వర్గములో సమావేశము పెద్దన, కృష్ణదేవరాయ పాల్గొనువారు. కొటూరి వెంకటేశ్వరరావు, పింగళి లక్ష్మీకాంతం 9-45 వాద్యసంగీతం 8. 10 ప్రసార సమాప్తి.

## మద్రాస్ (ఎ)

ఉ॥ 6-50 స్వాగతం 6-55 కార్యక్రమ వివరణ 7 వాద్యసమ్మేళనం 7-15 తమిళమున వా. 7-30 ఉదయగానము రి. 8 అం. వా. 8-15 టి. శ్రీనాథన్.

మ॥ 1 ఎ. ఐ. ఆర్. వాద్యగోష్ఠి 1-30 రి. 1-40 హిందీ వా. 1-50 రి 2 తమిళమున వా. 2-10 రి 2-30 తిరుచి వలె 3 ఎస్. బాలసుబ్రహ్మణ్యం గా. తిరుచి బాలసుబ్బరాయలు- వయొలిన్ ఎస్. వి. ఎస్. నారాయణన్ మృదంగం తిరువిల్వామలై విల్వాద్రి అయ్యర్ ఘటం 4 బి. వలె 4 30 పాశ్చాత్య సంగీతం రి.

సా॥ 5-30 కల్పకంరమణి 6 అం. వా. 6-10 క్రీడాసమీక్ష, అం. 6-15 ప్రాంతీయ వా. 6-25 వి. రాఘవన్ వీణ 7-15 తమిళమున వార్తలు. 7-30 సంధ్యాగానం (రి) 7 45 టి వి. రత్నం 8-30 బి వలె 8-45 దాదాభాయ్ నౌరోజీ (ఆంగ్లమున ప్రసంగం) టి. ఆర్. దేవగిరికర్ (పార్లమెంటు సభ్యుడు) ఢిల్లీనుండి రిలే 9 ఆంగ్ల వా॥ 9-15 ఎ. బాలకృష్ణన్ 9-45 పాశ్చాత్య సంగీతం (రి) 10-30 ప్రసార సమాప్తి.

## మద్రాస్ (బి)

ఉ॥ 7 తెలుగు వా॥ 7-15 డి. కె. పట్టమ్మాళ్ 7 30 పిల్లల కార్యక్రమం (త) 8 ఎ వలె 8-15 కన్నడ నాటిక 8-30 సుప్రభాతమ్: సంస్కృతమున కార్యక్రమం నిర్వహణ డా॥ వి. రాఘవన్, ఉషస్ ఋగ్వేదపఠనము, సూర్యశతక (మయూరకవి) కావ్యపఠనము కావ్యలహరి (జగన్నాధ పండిత), సూర్యమూర్తే (దీక్షితర్ కృతి). 8-45 మలయాళ నాటిక.

మ॥ 1 ఎ వలె 1-30 ఆంగ్ల వా॥ 1-40 (రి) 1-50 తెలుగు వా॥ 2 వేణువు 2-15 ఆటవిడుపు 3 ఎ వలె 4 లలిత గీతం 4-30 ఎ వలె.

సా॥ 5-30 ఎ వలె 6-15 ప్రాంతీయవా॥ 6-25 లలితగీతం 6-30 గ్రామ॥ కార్యక్రమం 7 తెలుగు వా॥ 7-15 దాదాభాయ్ నౌరోజీ (ప్రసంగం) 7-30 తమిళ ప్రసంగం 7-45 శ్రోతల పరిచయం 8 ఎ వలె 8.30 పరూర్ అనంతరామయ్యర్ -వయొలిన్ 9 ఎ వలె 9-15 ఐక్యరాజ్యసమితి కార్యక్రమం 9-30 రసమయ (విజయవాడనుండి రిలే) 9-45 రాధ, జయలక్ష్మి 10 శ్రోతలు కోరిన పాటలు(రి) 10-30 ప్రసార సమాప్తి.

## హైద్రాబాద్

ఉ॥ 6-50 సుప్రభత 6-55 కార్యక్రమ వివరణ 7 తెలుగు వా. 7-15 సంగీత పాఠం 7-30 గీతావళి-ఎం. పెరిందేవి. 7-45 సరళ సంగీత్ 8 ఆంగ్ల వా. 8-15 హిందీ వా. 8-30 ఖయాల్ 8-45 ఘజల్, గీత్ 8-55 ప్రసారవిశేష (హిందీ) 9 ఆవో బచ్చో 9-45 బాల వినోదం. మంత్రగుప్త (దశకుమార చరిత్రం) సీరియల్ నాటిక: రచన. కళాతపస్వి.

మ॥ 12-30 ఆకాశవాణి 12-50 మరాటీ 1 ఖయాల్ 1-30 యుగళ గానం (రి) 1-50 తెలుగు వా.

సా॥ 5-30 ఖయాల్ (రి) 5-45 ఘజల్ 6 మరాటీలో కార్యక్రమం 6-30 గీతలహరి (రి) 6-40 స్థానిక ప్రకటనలు 6-45 గ్రామసీమ - జానపద గీతాలు - ఎం. పెరిందేవి 7 తెలుగు వా. 7-15 గ్రామసీమ 7-45 కన్నడ వా. 8 నేను చదువుకున్న రోజులలో (ప్రసంగం) ఆర్. సుబ్బారావు. 8-15 పద్మా గోపాలకృష్ణన్ 9 ఆంగ్ల వా. 9-15 ఉర్దూ వా. 9-30 విజయవాడ వలె 9-45 పద్మా గోపాలకృష్ణన్ 10-30 ప్రసార సమాప్తి.

### ఆంధ్ర రాష్ట్రంలో రాగులపైరు

కర్నూలు, సెప్టెంబరు 1: ఆంధ్ర రాష్ట్రంలో 1954-55 సంవత్సరాలలో 7 లక్షల 15 వేల ఎకరాలలో రాగుల పైరు వేశారు. కిందటి ఏడాదితో పోల్చితే ఈఏడాది రాగులపైరు వేసిన భూమి వైశాల్యం సుమారు నూటికి 10 వంతులు తగ్గింది. కాలమాన పరిస్థితులు బాగు లేనందువల్లనే ఈయేడాది రాగులపైరు వేసినభూమి వైశాల్యం తగ్గినదని తెలుస్తున్నది.

### డి. సంజీవయ్యగారు

కర్నూలు, ఆగస్టు 31 : ఆంధ్రరాష్ట్ర సహకారమంత్రి డి. సంజీవయ్యగారు నిన్న రాత్రి ఒంగోలునుండి తిరిగి వచ్చారు.

# క్రీడారంగం

## న్యూజీలాండ్ క్రికెట్ జట్టు భారత పర్యటన

బొంబాయి, సెప్టెంబరు 1. ఓ. సట్ క్లిఫ్, జె. ఆర్. రీడ్ మొదలైన ప్రముఖులతో వస్తున్న న్యూజీలాండ్ క్రికెట్ జట్టు భారతదేశ పర్యటన జయప్రదంగా ఉండగల దన్న ఆశను భారత క్రికెట్ కంట్రోలుబోర్డు అధ్యక్షుడు విజయానగరం మహారాజకుమార్ వెల్లడించారు. న్యూజీలాండ్ జట్టు ఈ సీజనులో 5 టెస్టు పోటీలు, 4 రాష్ట్రజట్లతో పోటీలు ఆడుతుంది. 2 నెలపాటు పర్యటిస్తుంది. దీనికి భారత క్రికెట్ సంఘం ఖర్చులన్నిటిని పెట్టుకుని 8 వేల ఆస్ట్రేలియన్ పౌన్లు ఇస్తుంది.

వచ్చే సం॥ శీతాకాలంలో ఆస్ట్రేలియా జట్టుకానీ, పాకిస్థాన్ జట్టు కానీ తప్పకుండా భారతదేశంలో పర్యటించ గలదని ఆయన తెలియజేశారు.

### 40 వేల మీటర్ల పందెంలో జటోపెక్ గెలుపు

ప్రాగ్, ఆగస్టు 31 ఇక్కడ నిన్న రాత్రి జరిగిన హంగేరీ, జెకోస్లెవేకియా పోలెండ్ల మధ్య జరిగిన వ్యాయామ క్రీడా పోటీలలో జెకోస్లెవేకియా జట్టు 4 పాయింట్ల తేడాతో గెలిచింది (106½ - 102½).

ఒలింపిక్ పరుగు ఛాంపియన్ ఎమిల్ జాటోపెక్ (జెక్) నిన్న 5 వేల మీటర్లలోనూ, నేడు 10 వేల మీటర్లలోనూ గెలుపు సాధించాడు. 10 వేల మీటర్లను ఇతడు 29 ని. 58 సెకండ్లలో పూర్తిచేశాడు.

### మద్రాస్ ఫుట్ బాల్

మద్రాస్, సెప్టెంబర్ 1: ఇక్కడ జరుగుతున్న ఎం. యు. సి. ఫుట్ బాల్ టూర్నమెంటులో నేడు మధుర జిల్లా ఫుట్ బాల్ సంఘం జట్టు నేషనల్ ఇండియన్ యునైటెడ్ క్లబ్బును 4 గోలులలో ఓడించి (4-0), క్వార్టర్ ఫైనల్సులో ప్రవేశించింది.

ఖరగ్పూర్ లో జరుగుతున్న రైల్వే మండలాల ఫుట్ బాల్ పోటీలో దక్షిణ రైల్వే నేడు సెంట్రల్ రైల్వేని ఓడించి ఫైనల్సులో ప్రవేశించింది. (1-0). అట్లాగే వెస్టర్న్ రైల్వే నార్తర్న్ రైల్వేను ఓడించి ఫైనల్సులో ప్రవేశించింది (1-0) 3-వ తేదీన ఫైనల్సు పోటీ జరుగుతుంది.

### కాకినాడలో ఫుట్ బాల్ పోటీలఏర్పాటు

కాకినాడ, సెప్టెంబరు 1: కాకినాడ స్పోర్టింగ్ ఇంటరెస్ట్సు (క్రీడాభిమానుల) సమావేశం శ్రీ ఎం. వి. సుబ్బారావుగారి అధ్యక్షత క్రింద సమావేశమయి ఆంధ్రఎలెవెన్ ఫుట్ బాల్ ఆటగాడు శ్రీ జి. భద్రయ్య కృష్ణాలంబి ప్రమాదంలోమరణించినందుకువిచారము తెలుపుతూ తీర్మానించారు. 27 తేదీని కాబూలువెళ్లిన ఇండియన్ ఫుట్ బాల్ టీముకు ఆంధ్ర ఫుట్ బాల్ ఆటగాడు శ్రీ ఎమ్. అప్పారావు నాయకత్వము వహించినందుకు సంతసము వెలిబుచ్చిరి.

ఆంధ్ర స్టేటు ఫుట్ బాల్ అసోసియేషన్ వారిని కాకినాడలో తూర్పు గోదావరిజిల్లా అసోసియేషనును ఏర్పరచుటకు అంగీకరించవలసినదిగా కోరిరి.

సిటిజన్సు వెల్ఫేర్ లీగ్ కాకినాడలో ఫుట్ బాల్ లీగు నేర్పరుచుటకు తీర్మానించిరి. (స్వ వి.)

### గుంటూరు క్రికెట్

గుంటూరు, ఆగస్టు 31: నిన్న యిచ్చట పోలీసు గ్రౌండ్సులో హిందూ కాలేజి జూనియర్సుకును పట్టాభిపురం క్లబ్బునకు జరిగిన క్రికెటు పోటీ డ్రా అయింది.

స్కోరు వివరాలు :-పట్టాభి పురం క్లబ్బు 93 పరుగులు: కృష్ణమూర్తి 4 వికెట్ల నష్టానికి 5 పరుగులు చేశారు. శాస్త్రి 20 పరుగులు. శర్మ 20 పరుగులు శ్రీనివాసరావు 5 వికెట్ల నష్టానికి 3 పరుగులు. విద్యావత్సల్ 40 పరుగులు: హిందూ కాలేజ జూనియర్సు 88 పరుగులు. రామకేశవ 26. సుధాకర్ 18. కుమార్ 12. (స్వ. వి.)

### రంగుజాతులు ఫుట్ బాల్ కూడా చూడ వీలులేదు

జోహాన్నెస్బర్గ్, ఆగస్టు 31 రగ్బీ బంతి ఆటను స్టేడియంవద్దకు వచ్చి నల్లవాళ్లు, రంగుజాతి ప్రజలు చూడటానికి వీలులేదని, బ్లూంఫొంటీన్ నగర పురపాలక సంఘం నిన్న తిరిగి నిర్ణయించింది. ఈ పోటీ సెప్టెంబరు 14 న జరుగుతుంది. బ్రిటిష్ జట్టు ఇందులో పాల్గొంటుంది.

"ఇది నైతికంగా అన్యాయం అవుతుందేమో! మానీ వాళ్లని ఒక మూల ఎక్కడైనా కూర్చోని చూడనీయండి" అని రోజెబ్రాఫ్ అనే జాతీయపక్ష సభ్యుడు సలహాయిచ్చారు.

తీర్మానానికి జాతీయపక్షం వ్యక్తిరేకంగా వోటు వేసింది.

# మదరాసు ధరలు

మదరాసు, సెప్టెంబరు 2:

బంగారు వెండి నేటి మధ్యాహ్నం 1 గంటకు నడచిన 1-కి ఎన్నారు బొమ్మ సేల్సుటాక్సులో సహా

| | | |
|---|---|---|
| | రు. | 62-0-0 |
| పిటాబంగారం తులం | రు. | 95-4-0 |
| మూస బంగారు | రు. | 94-0-0 |
| సీమవెండి తులం100 కి వెండి రు | | 166-8-0 |
| చిల్లర ధర | రు. | 1-11-6 |

## వేరుశనగ

(కరు పా॥ 1-కి ఎక్కువతోసా గింజల వెపిన సేల్సుటాక్సుతో సహా)

రు. 104 నుండి 107-0-0

వేరుశనగనూనె ఎక్కువ పిల్లర్ బిల్లో 8% (500పా.) రుచి చిల్లరధర రు. 206-0-0

197 కొంకాయనూనె (37½ పౌనులు)

| | | |
|---|---|---|
| అంబుమార్కు | రు. | 26-0-9 |
| ఎం. ఎస్. బ్రాండ్ డబ్బా | | 26-4 9 |
| రాజా | రు. | 25-14-9 |

## అముదం

తిరుపత్తూరు (500 పౌ.) రు. 165-0-0

## పంచదార

బ్రిటిష్ సుగరు (2 క్వాట్సు) 85-8-9

సైమా (208క్వాట్సు) 87-87-8-0

సామర్లకోట (2 క్వాట్) 85-12-9

## న్యూయార్కు దూది

అక్టోబర్ వాయిదాధరలు

న్యూయార్కు, సెప్టెంబరు 1: న్యూయార్కు కాటన్ మార్కెట్ ధరలు నేడీ విధంగా ఉన్నవి:

| | |
|---|---|
| నేట ప్రారంభ ధర | 33.73 |
| నేట ముగింపు ధర | 33.73 |

## బొంబాయి మార్కెట్

బొంబాయి, సెప్టెంబరు 2: ఇవాళ పార్శీ సంవత్సరాది ఉత్సవంచేత ప్రత్తి మార్కెటు, వేరుశెనగ. అవిశెనత్తు మార్కెట్ మూసివేశారు.

| | |
|---|---|
| వెండి (100 తు.) | 164-0-0 |
| బంగారం (1 తు.) | 93-14-0 |
| సావరిన్ | 61-2-0 |

## ఆదోని ప్రత్తి వేరుశనగ ధరలు

ఆదోని, సెప్టెంబరు 10: ఈ నెల 6 వ తేదీతో అంతమైన వారంలో, ఇక్కడ ప్రత్తి, వేరుశెనగ ధరలు యీ విధంగా వున్నవి :

| | | |
|---|---|---|
| ప్రత్తి: | 392 పా॥ ల ఆరవ్రుత్తి | |
| ముంగారి | | 91/- |
| ఫారం | రు. 104/- | 106/- |
| లక్ష్మి | ,, | 111/- |
| దూది | ముంగారి | 200/- |
| ఫారం | రు. | 275/-288/- |
| లక్ష్మి | రు. | 260/-265/- |
| ప్రత్తిగింజలు-దూ 1 కి ఫారం 12½-పా॥ లు; లక్ష్మి 16- పా॥లు. | | |
| వేరుశెనగ : | | 28 పా॥ లు. |
| కాయ : క. జ. | | 4-3-6-4-6-6 |
| ఎ. ఎస్. టి. | | 4-3-6-4-5-6 |
| వేరుశెనగ గింజలు: | | 104/-107-8-0 |

## నంద్యాల ధరలు

ఎద్రవూడ 784 పా॥ పుట్టి 400/-
పత్తిగింజలు 1200 పా॥లు సెం 14 90-95

వేరుశెనగకాయ 26 2/8 పా॥ రు 3-14-0, 3-15-0.

వేరుశెనగ పప్పు 581 పా॥ పుట్టి రు 105-108.



మైసూరు ముఖ్యమంత్రి హనుమంతయ్యగారు మద్రాసుకు వచ్చిన సందర్భంలో, ఆగస్టు 31 వ తేదీ సాయంత్రం ఆయనకు పౌరసన్మానం జరిగింది. ఈ చిత్రంలో మైసూరు ముఖ్యమంత్రి హనుమంతయ్య, మేయర్ చిదంబరం, మద్రాసు ముఖ్యమంత్రి కామరాజ్ ఉన్నారు. వ్యవసాయ మంత్రి భక్తవత్సలం, హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి పి. వి. రాజమన్నార్ గారలను చూడవచ్చు.



జాతీయాభివృద్ధి ప్రణాళిక క్రింద తిరువూరు బ్లాకు చిట్టేల గ్రామంలో రహదారి నిర్మాణం ప్రారంభించబడింది. శాసనసభ్యుడు పేట బాపయ్యగారు, జిల్లా ప్రణాళికాధికారి మొదలగువారిని ఈ చిత్రంలో చూడవచ్చు.



ఒంగోలు తాలూకా ఆయుర్వేద వైద్యమండలి వారు శాసనసభ్యుడు టి. జయ్యర్ దాసుగారిని సన్మానించారు. ఈ సన్మాన సభకు, సహకార మంత్రి సంజీవయ్యగారు అధ్యక్షత వహించారు. ఈ చిత్రంలో ఎడమనుండి ఐదవవారు జయ్యర్ దాసుగారు.

# అభివృద్ధికి నిజాం పెట్టుబడి

## ముఖ్యమంత్రి వివరణ

హైదరాబాద్, అగస్టు 31: రాష్ట్రంలో అభివృద్ధి కార్యక్రమాలను గురించి నిజామ్ శ్రద్ధ వహించ లేదనడం పొరపాటని హైదరాబాద్ రాష్ట్ర శాసన సభలో ముఖ్యమంత్రి బూర్గుల రామకృష్ణారావుగారు చెప్పారు.

నిజామ్ వద్దనుంచి అభివృద్ధిపనులకు డబ్బు సేకరించి, జాగీర్దారులకు పరిహారం ఇవ్వడం మాని వెయ్యాలని ప్రతిపక్ష సభ్యులు "అడేపనిగా చేసేవాదన"పై డాక్టరు రామకృష్ణారావుగారు ఇట్లా చెప్పారు: "భారత ప్రభుత్వం ఏర్పాటుచేసిన సెక్యూరిటీ పత్రాలలో నిజాం సుమారు రూ 30 కోట్ల పెట్టుబడి పెట్టారు. రాష్ట్ర ప్రభుత్వానికి రు. 19 కోట్లు అప్పుగా ఇచ్చారు. ఇవికాక వడ్డీలేని అప్పుగా తన భరణంనుంచి తుంగభద్ర ప్రాజెక్టు నిర్మించడానికి రాష్ట్ర ప్రభుత్వానికి ఏటేట రూ 50 లక్షలు ఇస్తున్నారు. తుంగభద్ర ప్రాజెక్టు నిర్మాణం పూర్తిఅయినతరువాత తన భరణంనుంచి ఈ సొమ్మును నందికొండ ప్రాజెక్టు నిర్మాణానికి నిజామ్ ఇస్తారని ఆశిస్తున్నాను."

# కొత్త సోషలిస్టుపార్టీ

## కింది తరగతులను సమీకరించునని లోహియా

న్యూఢిల్లీ, అగస్టు 31: తాను ఏర్పాటుచేసే కొత్త సోషలిస్టుపార్టీ ప్రస్తుతం పనిచేస్తున్న కమ్యూనిస్టు, ప్రజాసోషలిస్టుపార్టీలవలె కాకుండా, సమాజంలో నూతన శక్తులను బయటికి లాగటం ద్వారా పనిచేస్తుందని డా॥ రాంమనోహర్ లోహియా నేడిక్కడ విలేఖరుల గోష్ఠిలో వెల్లడించారు.

"ఈపార్టీలు విప్లవాత్మక విధానాలనే అనుసరిస్తున్నా, తమ లక్ష్యాలని సాధించేందుకు ప్రస్తుతం సమాజంలో ఉన్న శక్తులనే వినియోగించుకోవాలని చూస్తున్నవి. ప్రస్తుతం సమాజంలో పలుకుబడి ఉన్న వర్గాలద్వారా లక్ష్యాన్ని సాధించుకోవాలని చూస్తారే కాని, అసలు ప్రజానీకాన్ని కదిలించరు. ఎంతసేపటికీ విద్యావంతులు, మధ్య తరగతి రైతులు, ధనికుల మీదనే ఆధారపడతారు. కాని పంటలో పాలుకు పనిచేసేకూలీలు, వ్యవసాయకూలీలు, చిన్న రైతులు, మధ్యతరగతుల్లో దిగువభాగం మొదలైనవాళ్లు అసంఘటితంగానే ఉండిపోయినారు. వీళ్లని సోషలిస్టుపార్టీ సంఘటితం చేస్తుంది" అని ఆయన వివరించారు.

## భారత సేవక్ సమాజ్ జండా పాట

న్యూఢిల్లీ, అగస్టు 31: భారత్ సేవక్ సమాజ్ జండాను యెగరవేసేటప్పుడు పాడే జండాపాటనూ, ఈ సంఘం ఆశయాలనూ ప్రచారం చేసే నాటకాన్నీ పంపే వాటి గడువును అగస్టు 31 నుంచి సెప్టెంబరు 30 కి పెంచారు.

ప్రాంతీయభాషల్లో పాటలు, నాటకాలకు గడువు అక్టోబరు 15 వరకూ పెంచారు. ప్రాంతీయభాషల్లో నాటకాలకు, పాటలకు ఒక్కొక్క దానికి రు 500 బహుమతి ఇస్తారు.

## ఉపయోగించని ఇంటికి రూ 460 వేలు అద్దె!

న్యూఢిల్లీ, అగస్టు 31: తంతితపాలా శాఖ, కలకత్తాలో రెండు భవనాలను అద్దెకు తీసుకుని వాటిని ఏ విధంగానూ వాడుకోకపోయినా 1952 డిసెంబరు 31 నాటికి వాటికి రూ 460 వేలు దండుగ బాడుగగా ధారపోసింది. పబ్లిక్ అక్కౌంట్స్ కమిటీ ఇవాళ పార్లమెంటు ఉభయ సభలలోనూ సమర్పించిన 30 వ నివేదికలో ఈ సంగతి వెల్లడి చేసింది.

ఈ రెండు భవనాలలోనూ ఒకటి 1948 మే లోనూ మరొకటి జూన్ లోనూ అద్దెకు తీసుకున్నారు. ఒక దానికి అద్దె నెలకు ఏడువేల రూపాయలు. రెండవ భవనం అద్దె రు 2560. తంతి తపాలా కార్యాలయాలు వీటో వీటిలో నెలకొల్పాలనే ఉద్దేశ్యంతో వాటిని అద్దెకు తీసుకున్నారు. అయితే అదిమాత్రం జరగలేదు. అధికారులు దూరదృష్టితో ఆలోచించకుండా వ్యవహరించినందువల్లనే ఈ దుబారా జరిగినట్లు తేలిందని పబ్లిక్ అక్కౌంట్స్ కమిటీ తన నివేదికలో పేర్కొంది. వీటిలో ఏడువేల రూపాయలు అద్దె చెల్లిస్తున్న భవనం ఇంకా నిరుపయోగంగానే ఉన్నదనీ, కేంద్ర పునరావాస శాఖతో సంప్రతించి, నెలనెలా అయ్యే ఈ ఏడువేల రూపాయిల దుబారా వదల్చుకోవడానికి ప్రయత్నించాలని ఈ సందర్భంలో సూచించారు.

## హ్యూస్టన్‌మేయరునిష్కృతి

హ్యూస్టన్, (టెక్సాస్), అగస్టు 31: ఇక్కడి విమానాశ్రయంలో గల హోటలులో జాతి విద్వేష చర్యకు గురియైన భారత రాయబారి, శ్రీ జి. యల్. మెహతాను ఆయన కార్యదర్శి శ్రీ బి. ఎ. రాజగోపాలన్‌ను అదే హోటల్‌లో విందులో పాల్గొనవలసిందిగా హ్యూస్టన్ మేయరు ఆహ్వానం పంపారు. శ్రీ మెహతా అలాటి ఆహ్వానం అనవసరమని చెప్పారు.

# 500 మంది నాగా తిరుగుబాటుదార్లు

## పట్టుకొనడానికి ప్రయత్నం

షిలాంగ్, అగస్టు 31: సుమారు 500 మంది నాగజాతివారు త్యూఎన్‌సాంగ్ సరిహద్దు దిశన ఉన్న అఘునాటో సమీపంలో దాగి ఉన్నట్లు ఇవాళ అధికారరీత్యా వార్తలు వచ్చాయి.

వారిదగ్గర బ్రెన్ తుపాకులు, స్టెన్ తుపాకులు, రైఫిళ్లు మొదలైన ఆయుధాలు ఉన్నాయట. లొంగిపోవలసిందని కోరుతూ ప్రభుత్వం చేసిన ప్రకటనను ధిక్కరించి, దుర్గమమైన ఈ కొండ ప్రాంతాలలో విడిశారు.

తమ రహస్య ఆవాసంలోకి ఎవరూ రాకుండా, అసలే దుర్గమంగా ఉన్న ఆ ప్రాంతంలో వారు ఎన్నో అడ్డాలుపెట్టి కట్టుదిట్టం చేసుకుంటున్నారు.

వీళ్లందరినీ లొంగదీసుకురావడానికి అక్కడి అధికారుల కోరికపైననే భారతప్రభుత్వం ఒకదళాన్ని పంపింది. ఇంతవరకూ సంఘర్షణ అంటూ జరగలేదు. భారత సైనికదళం మాత్రం, ఇప్పుడు ఈ 500 మందీ అమాంతం అదృశ్యమైపోకుండా మాత్రం కట్టుదిట్టాలుచేసింది. ఇప్పుడు సైన్యం చేయవలసినపని వీళ్లందరినీ పట్టుకోవడమే. ఈ పని పూర్తి అయిపోగానే ఈ దళాన్ని ఉపసంహరించి వేస్తామని ప్రధాని నెహ్రూ మొన్న పార్లమెంటులో ప్రకటించారు.

ఇది ఇలాఉండగా ఈవచ్చిన భారత సైన్యం త్యూఎన్‌సాంగ్ ప్రాంతంలో పరిపాలనా వ్యవహారాలను తన ఆధీనంలోకి తీసుకున్నదని ప్రచారంలోకి వచ్చిన వార్తలను స్థానిక నాగా అధికారులు నేడు ఖండించారు. ఈ వార్తలు పూర్తిగా నిరాధారమైనవని నేడు అధికారరీత్యా ఒక ప్రకటనకూడా చేశారు.

# మనిలాలో భారత విమాన నిర్బంధం

## వాతావరణం సరిగా లేక దిగినఫలితం

మనిలా, అగస్టు 31: సరియైన అధికార పత్రాలను ఫిలిప్పైన్స్ విదేశాంగశాఖనుంచి పొందకుండా విమానాశ్రయంలో దిగిన ఒక భారతీయ విమానాన్ని ఇక్కడి అధికారులు నిలిపివేశారు.

ఈ విమానం టోకియోనుంచి హాంగ్‌కాంగ్‌కు వెళ్లవలసి వున్నది. వాతావరణ పరిస్థితులు ప్రతికూలంగా ఉన్నందున ఇటువైపు మళ్లించవలసి వచ్చిందని విమానచోదకుడు కెప్టెన్ రిచర్డుఖాన్ చెప్పాడు.

ఈ విమానంలో 59 మంది ప్రయాణీకులు ఉన్నారు. దీనిని విడుదల చేయించడంకోసం భారత రాయబార కార్యాలయం ప్రయత్నిస్తోంది.

## బాంకాక్‌కు ప్రయాణం

మనిలా విమానాశ్రయంలో అనుమతి లేకుండా దిగిన భారతీయ విమానాన్ని భారత రాయబార కార్యాలయం జోక్యంవల్ల నేడు బాంకాక్‌కు వెళ్లనిచ్చారు.

# వలసలు వదలకుంటే కమ్యూనిజమే

## బ్రిటిష్‌వారికి హెచ్చరిక

కౌలాలంపూర్, అగస్టు 31: "మలయాలో స్వచ్ఛమైన, నిజాయితీగల, జాతీయతాభావాలవ్యక్తికి తోడ్పండి. లేదా, కమ్యూనిస్టుపార్టీకి అధికారం వప్పగించండి" అని ప్రధాని టెంగ్‌కూ రహిమాన్ నేడు మలయా శాసనసభను ప్రారంభిస్తూ బ్రిటిష్‌వారి నుద్దేశించి అన్నాడు. "స్వాతంత్ర్యమన్నా సాధించాలి. లేదా మేం తొలగిపోవాలి. ఇందుకు నాలుగేళ్లు గడువు పెట్టుకున్నాం" అని స్పష్టం చేశాడు.

"మలయన్లకు" ఆర్థికశాఖ అంతరంగిక భద్రత "యీ రెంటిపై అధికారం ఇవ్వలేదు. ఇవి రెండు మాకు చేతకావని అనుకోవద్దు. వీటి మీద మాకు పెత్తనం లేకపోతే, మేం వుండి ప్రయోజన మేమిటి?" అని రహిమాన్ ప్రశ్నించాడు. "స్వాతంత్ర్యం కావాలి" అనే నినాదాలు ప్రతిధ్వనించాయి.

# గ్రాండ్వాల్ రాజీనామా

## సామ్రాజ్య వాదంలో ఔదార్య ఫలం

పారిస్, అగస్టు 31: మొరాకోలోని ఫ్రెంచి రెసిడెంట్ జనరల్ గిల్బర్ట్ గ్రాండ్వాల్ రాజీనామా చేసినట్లు ప్రకటన వెలువడింది. ఈయన ఈ పదవిలో నియమితుడై రెండు నెలలే అయింది. మొరాకో విప్లవకారులతో కొంచెం ఉదారంగా వ్యవహరించాలనే స్వభావం కలవాడు. అందుచేత ఫ్రెంచి మంత్రివర్గంతో భేదాభిప్రాయాలొచ్చాయి.

ఈయన రాజీనామా చేసినప్పటికీ, మాజీ సుల్తాన్ బేయాసఫ్‌ను మెడగాస్కర్ నుంచి తిరిగి రప్పించి సెప్టెంబరు 12 నాటికి నూతన ప్రభుత్వం ఏర్పరచాలనే అసలు పథకంలో ఏమీ మార్పురాదని అధికార వర్గాలవారు అంటున్నారు.

# సమితిలో భారతీయ ఉద్యోగి తొలగింపు

## అక్రమమని వాదం

జెనీవా, అగస్టు 31. న్యూఢిల్లీలోని సమితి సమాచార కేంద్రముాజీ డిప్యూటీ డైరెక్టరు శ్రీ కుమార్ చట్టోపాధ్యాయ తనను అక్రమంగా ఆ పదవి నుంచి తొలగించారనీ, అందుకు మూడు సంవత్సరాల జీతం పరిహారంగా ఇవ్వాలనీ, సమితి పరిపాలనాశాఖ విచారణ సంఘం ఎదుట వాదించాడు. ఈ పరిహారం మొత్తం 24800 డాలర్లు.

శ్రీ చట్టోపాధ్యాయ ప్రస్తుతం భారత ప్రభుత్వ సమాచారశాఖ ఉద్యోగిగా పని చేస్తున్నారు. 1931లో నానాజాతి సమితి న్యూఢిల్లీ కార్యాలయంలో చేరారు. తరువాత ఆ సమితి స్థానే ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరం ఏర్పాటైన ఐక్యరాజ్య సమితి ఢిల్లీ కార్యాలయంలో నియమితులైనారు. కొరియా, కాశ్మీరుల విషయమై సమితి వైఖరిపట్ల ఈయన నిరాశ, నిరుత్సాహం చెందాడన్న ఆరోపణలపై ఈయనను పదవి నుంచి తొలగించారు.

# జోర్డాన్‌నీటి వినియోగం

## పథకం తయారీ

కెయిరో, అగస్టు 31: జోర్డాన్ నదీ జలాల వినియోగానికి సంబంధించిన ఒక పథకాన్ని పశ్చిమ ఆసియాలో ఐసెన్‌హోవర్ ప్రత్యేక రాయబారి ఎరిక్ జాన్‌స్టన్ నేడు ఈజిప్షియన్ విదేశాంగమంత్రి మహామద్ ఫౌజీకి సమర్పించాడు.

గత ఐదురోజుల్లోను జోర్డాన్ ప్రభుత్వ నాయకులతో దీనిని చర్చించి జాన్‌స్టన్ నేడే ఇక్కడకు వచ్చాడు. అరబ్-ఇజ్రేయల్ మధ్య జోర్డాన్-యార్ముక్ నదుల విభజనపై ఒక ఒప్పందం కుదర్చాలని లాన్‌స్టన్ ప్రయత్నిస్తున్నాడు. ప్రస్తుతం ఈ నదులనీరు సముద్రం పాలవుతున్నది.

ఈజిప్టు-ఇజ్రేయల్ మధ్యఉన్న ఉద్రిక్తత మూలంగా ఒప్పందం కుదరదేమోనని చాలామంది భావిస్తున్నారు. అరబ్‌లీగు రాజకీయ సంఘం ఒచ్చేవారం తుది నిర్ణయం చేస్తుంది.

# టిబెట్-భారతరస్తా నిర్మాణం

## ప్రథమప్రణాళికా కాలంలో పూర్తి

సిమ్లా, అగస్టు 31: భారతదేశంనుంచి టిబెట్ సరిహద్దులకు వేస్తున్న రోడ్డు మొదటి పంచవర్ష ప్రణాళిక పూర్తి అయేలోగా పూర్తి అవుతుందని హిమాచల్ ప్రదేశ్ నిర్మాణశాఖమంత్రి గౌరీ ప్రసాద్ నేడు శాసనసభలో వెల్లడించారు. రోడ్డు పూర్తి అవుతే, టిబెట్ సరిహద్దుల్లో ఉన్న చీనీవరకూ జీప్‌కార్లు వెళ్లగలవు.

ఈ రోడ్డు వెయ్యటంలో ఇంతవరకూ ప్రమాదాలవల్ల 23 మంది పనివాళ్లు చనిపోవటం, 40 మంది గాయపడటం జరిగిందనీ, వాళ్ల పరిహారాల విషయమై ఏర్పాట్లు జరుగుతున్నవనీ, ఈ రోడ్డు కోసం ఇప్పటికి 46,38,500 ఖర్చయినవనీ ఆయన తెలియజేశారు.

# రొయ్యపొట్టు ఎగుమతి

## కొచ్చిన్ వ్యాపారుల విజ్ఞప్తి

ఎర్నాకుళం, అగస్టు 31: కొచ్చిన్ రేవునుంచి ఎగుమతి చేయదగిన రొయ్యపొట్టు మొత్తంపై విధించిన నిర్బంధాలను తొలగించ వలసిందని కోరుతూ కొచ్చిన్ రొయ్యపొట్టు ఎగుమతిదారుల సంఘం కేంద్ర వాణిజ్య మంత్రికి ఒక నివేదిక సమర్పించింది.

ఈ నిర్బంధాలవల్ల కేరళలో ప్రాచీన కాలంనుంచీ వస్తున్న ఈ వ్యాపారం దెబ్బతిని, ఎంతోమంది నిరుద్యోగులవుతారని ఈ నివేదికలో తెలియజేశారు. ఈ పరిశ్రమమీద పశ్చిమ కోస్తాలో 8 లక్షల మందికి పైగా ప్రజలు జీవిస్తున్నారనీ, ఏడాదికి 2½ కోట్ల రూపాయల విదేశీ ద్రవ్యం లభిస్తున్నదనీ వీరు వివరించారు.

# శాస్త్రవేత్తలు శాంతిని నెలకొల్ప యత్నించాలి

బ్రిస్టల్, అగస్టు 31: ప్రచ్ఛన్న యుద్ధం సమాప్తి చెందడానికి ప్రస్తుతం జరుగుతున్న సంప్రతింపులు జయప్రదం కావడానికి శాస్త్రజ్ఞులు చేయగలిగిన సహాయమంతా చేయాలని 1947 లో రసాయనిక శాస్త్రంలో నోబుల్ బహుమానం పొందిన డా॥ రాబర్ట్ రాబిన్‌సన్ ఒక విజ్ఞప్తి చేశారు.



# అపహృత వ్యక్తుల ఉద్ధరణ

## శాసనం పొడిగించడానికి రాజ్య సభ ఆమోదం

న్యూఢిల్లీ, అగస్టు 31: రాజ్యసభ నేడు అపహృత వ్యక్తుల విడుదల శాసనం కొనసాగింపుచట్టాన్ని ఢిల్లీ సిటీ, మురుగు పారుదల సవరణ చట్టాన్ని ఆమోదించింది.

అపహృత వ్యక్తుల విడుదల శాసనం కొనసాగింపు చట్టంపై చర్చలో శ్రీమతి సావిత్రి నిగం ఇందుకోసం ఏర్పడిన సంఘంలో ఇంకా ఎక్కువమంది సంఘసేవకులు ముఖ్యంగా స్త్రీలు వుండాలని సూచించారు. శ్రీ భూపేష్ గుప్త ఈ విడుదల కార్యక్రమాన్ని సంఘ సేవాసంస్థలకు వప్పచెప్పాలన్నారు. చట్టాన్ని 1958 లేక 1959 వరకూ వుంచేటట్లు చేయాలనికూడా శ్రీమతి నిగం అన్నారు. ఈ విడుదల పూర్తి అయేవరకూ పాకిస్తానుతో వడిన ఒప్పందాలన్నిటినీ అమలుజరపకుండా వుంచాలనీ, కొత్త ఒప్పందాలు చేసుకోరాదనీ సర్దార్ బుద్ సింగ్ అన్నారు. పాకిస్తాన్ ఉద్యోగులు 2 వేల మంది యువతులను వారివద్ద వుంచుకొన్నట్లు తెలిసిందనీ, వాళ్ళందరికి విడుదల కలిగించేందుకు గట్టి చర్యలు జరపాలనీ శ్రీ హెచ్. సి. మథుర్ అన్నారు. శ్రీ కిషన్‌చంద్ ఈ విడుదల కార్య క్రమం కొనసాగింపును ప్రతిఘటించారు.

# సంస్థానాధిపతుల భరణాలు

## పన్ను వేయ వీలుకాదు

న్యూఢిల్లీ, అగస్టు 31: మాజీ సంస్థానాధీశ్వరులు తమ స్వంతఆస్తిగా వుంచుకొన్న ప్రభుత్వ సెక్యూరిటీలపై వచ్చే వడ్డీమీద ఇప్పుడుకూడా రాబడిపన్ను చెల్లించ నక్కర్లేదని రివెన్యూ, సివిల్ ఖర్చుల మంత్రి శ్రీ ఎం. సి. షా లోక్‌సభలో ఇవ్వాళ తెలియచేశారు. యీ సెక్యూరిటీల మొత్తం విలువ తెలుసుకోవటం సాధ్యం కాదన్నారు.

ఇకనుంచీ అయినా వారివద్ద పన్నులు వసూలు చేయవలసున్నారా అని అడగగా, వారికిచ్చిన హామీలను పాటించాలని రాజ్యాంగంలో నిబంధన (262) వున్న సంగతి సభ్యులకు తెలిసే వుంటుందనీ ఆర్థిక పరిశీలన సంఘంకూడా పన్నుల విషయంలో హామీని పాటించాలని, వారికిచ్చే భరణాలమీదకూడా పన్ను లేకుండా చేయాలనీ సూచించిన సంగతికూడా సభ వారికి తెలిసేవుంటుందనీ మంత్రి అన్నారు.

సర్దార్ స్వరన్‌సింగ్ చర్చకు సమాధానమిస్తూ అసలు ఈ విడుదల గురించి ఉన్నత స్థాయిని ఆలోచింపబడుతున్నదనీ ఈ పనిని సాధ్యమయినంత త్వరలో ముగించాలనే ప్రభుత్వ వుద్దేశమని అన్నారు.

# రైల్వే వ్యవహారాలు

## వీధినపడడం సరికాదనీ మంత్రి హితవు

న్యూఢిల్లీ, అగస్టు 31: రైల్వేల పునర్వ్యవస్థీకరణ వ్యవహారాన్ని వేత్తలసంఘం పరిశీలనకు వదిలిపెట్టాలన్న సూచనను రైల్వేల మంత్రి శ్రీ లాల్ బహదూర్ శాస్త్రి నేడు నిరాకరించారు.

ఆచార్య ముఖర్జీహీరాన్ ప్రతిపాదన పైలోక్‌సభ ఇవ్వాళ రైల్వేల పునర్వ్యవస్థీకరణను గురించి ఒక అరగంటసేపు చర్చించింది. ఆచార్య ముఖర్జీ పునర్వ్యవస్థీకరణను సమీక్షించేటప్పుడు ముందు ముందు ఏమి చేయాలన్నది స్పష్టంగా మనస్సులో వుంచుకోవాలన్నారు. సీనియారిటీ సమస్య చాలా చిక్కుగా వున్నదనీ ఈసందర్భంలో మంత్రి ఏదో ఒక సూత్రం తయారు చేస్తున్నారని విన్నాననీ, అదేమిటో మంత్రి తెలపాలనీ అన్నారు. రైల్వేలో అవినీతిని గురించి పరిశీలించిన సంఘం సిఫార్సుల దృష్ట్యా పునర్వ్యవస్థీకరణ ఏ విధంగా పనిచేస్తున్నదీ పరిశీలించటం అవసరమన్నారు.

శ్రీమతి రేణూ చక్రవర్తి, శ్రీబసంత కుమార్ దాస్, శ్రీ సాధిన్‌గుప్త, శ్రీ కె. కె. బాసు సీనియారిటీ విషయంలో ఏమి చేయబోతున్నారనీ, అదనంగా వున్నట్లు తేలిన సిబ్బందిని ఏమిచేస్తారనీ అడిగారు.

మంత్రి సమాధానమిస్తూ రైల్వే పనివారు చీటికీ మాటికీ వీధుల్లోకి పోయి ప్రదర్శనాలు జరపటం బాగుండలేదనీ వారిపనిని వారు సరిగ్గా చేయవలసిందని ముఖర్జీ ప్రభృతులు చెప్పాలనీ అన్నారు. వర్గీకరణ, పునర్వ్యవస్థీకరణ సందర్భంలో, రైల్వేలు పెంపొంది ఎక్కడైనా పనిభారం పెరిగిపోయినప్పుడు ఆప్రాంతాన్ని రెండు భాగాలు చేయటానికి నిశ్చయించారనీ, ఈవిషయంలో రైల్వే బోర్డు నిష్పాక్షికంగా వుండలేదనేమాటతో తాను ఏకీభవించజాలనని ఇటీవల తూర్పు రైల్వే విభజన అభ్యోర్థ సూచన మీదనే జరిగిందని ఆయన అన్నారు. ఏమైనా ఈ విషయాన్ని ప్రభుత్వానికీ, రైల్వేలకూ వదిలిపెట్టటం మంచిదన్నారు.

## ఐ. ఎ. యస్. ఉద్యోగుల పింఛను నిబంధనలు

న్యూఢిల్లీ, అగస్టు 31: ఐ. ఎ. యస్. ఉద్యోగుల పింఛన్ల నిబంధనలు త్వరలోనే నిర్ణయం చేయబడతాయని ఇవ్వాళ లోక్‌సభలో హోంశాఖ ఉపమంత్రి శ్రీ బి. ఎన్. దాతార్ తెలియచేశారు.

ఈ విషయంలో తాత్కాలిక ఉత్తరువు ఒకటి చేయబడిందనీ, కొద్దివారాలలో తుది ఉత్తరువులు చేయబడతాయనీ, కొన్ని రాష్ట్రాలతో ఈ విషయమై కొన్ని భేదాభిప్రాయాలు వచ్చాయనీ పింఛనుకు సంబంధించినంత వరకూ అన్ని విభేదాలనూ తీర్చివేయాలని ప్రభుత్వాభిప్రాయమనీ కూడా మంత్రి అన్నారు.

## గంటల పంచాంగం

శ్రీ మన్మథనం॥ అధిక భాద్ర॥ బ॥ ప్రథమ 1955 - సం॥ సెప్టెంబరు 3 శనివారం శ॥ ప్రథమ 12-45 పూభా 20-49 వర్జ్యం లేదు.

బ॥ ద్వితీయ సెప్టెంబరు 4 ఆదివారం ఆ॥ ద్వితీయ 11-25 ఉ భా 20-15 వర్జ్యం 6-11 ల 7-45కు.

ఆంధ్రపత్రిక

ఒక తేయని మొదలిందిన వలలక యు ప్రియము శన సుకంటున కగు ఖా వారు ఇది సదు చేయునది బరాయునము వరకరర-శశములకెలిన్ (మనో...)

శ్రీమన్మథనం॥ అధిక భాద్ర॥ బ॥ ప్రథమ శనివారం

## గోవాలో 'ఖైదీల' దుస్థితి

శాంతి విధానం వల్లనే గోవా సమస్య పరిష్కారమౌతుందని ప్రధానమంత్రి నెహ్రూ మరొకసారి ఉద్ఘాటించారు. ప్రపంచసమస్యలపరిష్కారాన్ని రాజీసంప్రతింపుల ద్వారానే సాధించాలని భారత ప్రభుత్వం మొదట్నుంచీ అభిలషిస్తున్నది. గోవా సమస్యను పరిష్కరించడానికి భారత ప్రభుత్వం ఇందుకు విరుద్ధమైన విధానాన్ని అవలంభించదు. అయితే సత్యాగ్రహుల ఖైదీలపై పోర్చుగీసు అధికారులు జరుపుతున్న అమానుష చర్యలను నివారించడానికి అనుసరింపదగు మార్గాలను విచారించకుండా ఉండడానికి వీల్లేదు.

శాంతిని సాధించడానికి, శాంతియుతమార్గాన లక్ష్యాన్ని సాధించడానికి కొంత త్యాగం అవసరం. తప్పనిసరి కూడా. దేశ స్వాతంత్ర్య సంపాదనకు ఎందరెన్ని విధాల త్యాగం చేయలేదు? భారత దేశంలోని ఫ్రెంచి స్థావరాల స్వాతంత్ర్య సాధనకు మాత్రం కొందరు ప్రాణాలర్పింపవలసి రాలేదా? గోవా విమోచనకూడా ఈ కఠినమైన మార్గాన్ని అనుసరించడం వల్లనే సులభంగా సిద్ధిస్తుంది.

గోవాలో ప్రవేశిస్తున్న సత్యాగ్రహులపై పోర్చుగీసు అధికారులు అమానుషంగా ప్రవర్తిస్తున్నారు. ఖైదుచేసిన సత్యాగ్రహులను ఘోరంగా హింసిస్తున్నారు. ఈ ప్రవర్తన అంతర్జాతీయ సంప్రదాయాలకు పూర్తిగా విరుద్ధంగా వున్నది. యుద్ధఖైదీలను కూడా పోర్చుగీసు అధికారులు సత్యాగ్రహులను హింసించినట్లు ఏదేశమూ హింసించినట్లు కన్పించదు. అంతర్జాతీయ సంప్రదాయాలకు విరుద్ధంగా ఏదేశమైనా ప్రవర్తించితే, ఆ దేశంపై చర్యలు తీసుకున్న సందర్భాలు కూడా వున్నవి. అంతర్జాతీయ రెడ్ క్రాస్ సంఘం గోవాలో సత్యాగ్రహులపై జరుపబడుతున్న అమానుషచర్యలను విచారింపవచ్చును.

సత్యాగ్రహులను కాల్చివేయడం, సత్యాగ్రహులను నిర్బంధించి హింసించడంన్యాయ విరుద్ధం కాదు. సత్యాగ్రహులపై పోర్చుగీసు సైనికులు విద్యుచ్ఛక్తిని కూడా ప్రయోగించినట్లు తెలియుచున్నది. ఈ ...ంగా పోర్చుగీసు సైనికులు సత్యాగ్రహులపై చేసిన దౌర్జన్యాలను ఐక్యరాజ్య సమితి మానవ హక్కుల సంఘం విచారింపవచ్చును. లేదా అంతర్జాతీయ రెడ్ క్రాస్ సంఘం విచారింపవచ్చును. ఈ విషయంలో భారత ప్రభుత్వం ఇతర ప్రభుత్వాలతో సంప్రతింపవచ్చును. గోవాలో జరుగుచున్న అక్రమ్యాలకు భారత ప్రభుత్వం అదేవిధమైన ప్రతీకార చర్యలు తీసుకొనకపోవచ్చును. కాని సత్యాగ్రహులపై జరుగుచున్న దౌర్జన్య చర్యలను నివారించడానికి అంతర్జాతీయ సంప్రదాయాలు ఎంతవరకు ఉపయోగపడగలవో విచారింపవచ్చును. ఇది భారత ప్రభుత్వ విధానానికి అనుగుణంగానే వుండగలదు.

## ఎరువుల ఫ్యాక్టరీ

ఆంధ్రరాష్ట్రంలో ఒక ఎరువుల ఫ్యాక్టరీని స్థాపించడం అవసరమని కేంద్ర ప్రభుత్వ ఆహార శాఖ ఉపమంత్రి శ్రీ యం. వి. కృష్ణప్పగారు విజయవాడలో ఫలప్రదర్శనలో మాట్లాడుతూ సూచించారు. ఆ ఎరువుల ఫ్యాక్టరీని విజయవాడలోనే ఏర్పాటు చేయడం ఉత్తమమని అదే సందర్భంలో ముఖ్యమంత్రి శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారు ప్రకటించారు. ఇది ఉత్తమ సూచనేనని కూడా ఆ సమయంలో చాలామంది భావించారు. ఆంధ్రరాష్ట్రంలోగాని, ఆ పరిసర ప్రాంతంలోగాని ఎరువుల ఫ్యాక్టరీ ఒకటి ఏర్పడ్డం ఖాయమే అని స్పష్టమైన తర్వాత హైదరాబాదు ప్రభుత్వం ఆ ఫ్యాక్టరీని కొత్తగూడెం ప్రాంతంలోగాని లేక హైదరాబాదులో మరొక చోటగాని ఏర్పాటు చేయాలని సూచించింది. ఈ ఎరువుల ఫ్యాక్టరీ చివరికి ఆంధ్ర-హైదరాబాదు ప్రభుత్వాల మధ్య వివాదాలకు కారణమైంది. పోను పోను ఇది రాజకీయ సమస్యగా కూడా పరిణమింపవచ్చును.

ఆంధ్రరాష్ట్రంలో వుంటున్న ఆంధ్రులు విశాలాంధ్ర ఏర్పడాలని ఆందోళన చేస్తూ, ఎరువుల ఫ్యాక్టరీని హైదరాబాదులోని ఆంధ్ర ప్రాంతంలో నెలకొల్పడానికి ఎందుకు సమ్మతింపరని కూడా కొందరు ప్రశ్నిస్తున్నారు. ఆంధ్రలో ఎరువుల ఫ్యాక్టరీస్థాపన విషయమై వ్రాస్తూ ఆంధ్ర ప్రాంతంలో ఎక్కడ ఈ ఫ్యాక్టరీని స్థాపించాలన్నది ప్రశ్నే కాదని స్పష్టం చేశాం. ఎరువులు తయారయ్యే ప్రాంతంనుంచి ఇతర ప్రాంతాలకు చౌకగా, సులభంగా, శీఘ్రంగా రవాణా కావాలి. రవాణా సౌకర్యాలు లేనప్పుడు రవాణా ఖర్చులు అధికమై ఎరువు ధర పెరిగే ప్రమాదం వుంటుంది. ఈ సమస్య ఇలా వుండగా, దక్షిణాదిన ఎక్కువ డెల్టా భూమి వున్నది కృష్ణా-గోదావరి, కృష్ణా-పెన్నా ప్రాంతంలోనే. నందికొండ ప్రాజెక్టు పూర్తిఅయిన తర్వాత కూడా ఈ ప్రాంతంలోనే ఎక్కువ భూమి సాగులోకి వస్తుంది. వీటన్నింట్నీ గమనించి ఎరువుల ఫ్యాక్టరీని విజయవాడ సమీపంలో స్థాపించడం ఎక్కువ ప్రయోజనకరమని ఇదివరకే సూచించియుంటిమి.

ఆంధ్ర ముఖ్యమంత్రి ఎరువుల ఫ్యాక్టరీస్థాపన విషయంలో ప్లానింగ్ కమిషను సభ్యులతోనూ, కేంద్ర మంత్రులతోను సంప్రతింపులు జరుపుతున్నట్లు తెలుస్తున్నది. ఈ సంప్రతింపులు ఫలించగలవని ఈ ఫ్యాక్టరీని విజయవాడ ప్రాంతంలో నెలకొల్పడానికి అందరూ సహాయపడగలరని ఆశిస్తున్నాము.

## శబరిలో ఇద్దరిమృతి?

### జిల్లాఅధికార్ల దర్యాప్తు

భద్రాచలం, సెప్టెంబరు 1: గోదావరికి ఉపనదిఅయిన శబరీనదికి వరద రావడంవల్ల గోదావరీవరద ఇంకా పూర్తిగా తగ్గిపోలేదు. గోదావరిలో ఈవేళ ఇక్కడ 43.1 అడుగుల నీరు, దుమ్ముగూడెం ఆనకట్టవద్ద 13 అడుగులు ఉన్నది.

కూనవరంకాపురస్థులు ఒక పురుషుడూ, స్త్రీ శబరీనది దాటుతూ వరదలో కొట్టుకుపోయినారని ఇక్కడికి తెలియవచ్చింది. సబ్ కలెక్టరు, పోలీసు డిప్యూటీ సూపరింటెండెంటు ఆ విషయం దర్యాప్తుచెయ్యడానికి ప్రత్యేక లాంచీలో బయలుదేరివెళ్ళారు.

ఈ వరదరోజులన్నింటిలో నూ భద్రాచలంలోని తంతితీగలన్నీ తెగిపోయినవి. భద్రాచలం, రాజమండ్రి మధ్య రేడియో టెలిఫోన్ ద్వారా మాత్రమే వార్తాసౌకర్యం ఉంటూ వచ్చింది.

## పాక్ రాజ్యాంగ పరిషత్తు

### పశ్చిమ రాష్ట్ర విషయమై తీవ్ర వాదోపవాదాలు

కరాచీ, సెప్టెంబరు 1: పశ్చిమ పాకిస్తాన్ ఏకీకరణ బిల్లుపై నేడు రాజ్యాంగ పరిషత్తులో సుహ్రావర్దీకి పంజాబ్ ఆవామీలీగ్ మాజీనాయకుడు మియాన్ అబ్దుల్ బారీకి తీవ్రవాదోపవాదాలు జరిగాయి. సుహ్రావర్దీ, మియాన్ జఫర్ షా, ఇరువురు స్వార్థ రాజకీయాలు అవలంబిస్తున్నారని బారీనిమర్శించాడు. సుహ్రావర్దీ తన ఆక్షేపణ తెలిపాడు.

సరిహద్దు మంత్రి జలాలుద్దీన్ నేడు తన ప్రసంగాన్ని కొంతసేపు బెంగాలీలో చదివేసరికి అంతా ఆశ్చర్యపోయారు. "ఉర్దూలో కూడా కాస్సేపు చదవనివ్వండి" అని ఆయన సభాపతిని అడిగాడు. "వీల్లేదు ఇంగ్లీషులో నుంచి బెంగాలీకి అనుమతించాం. ఇక మార్పు దానికి వీల్లేదు." అని సమాధానమిచ్చాడు. "పోనీ మా భాష పుష్తూలో మాట్లాడతాను" అని అడిగేసరికి ఇంతలో ప్రధాని చౌదరీ మొరాకో ప్రసక్తి తెచ్చాడు.

### ఉత్తరాఫ్రికా పోరాటానికి సానుభూతి

మొరాకో ఆల్జీరియా సమస్యలను సమితి చర్చనీయాంశంగా చేర్చాలని ఆసియా ఆఫ్రికావర్గం కోరితే, పాకిస్తాన్‌కూడ దానిని బలపరచవలసిందిగా సమితిలోని పాకిస్తాన్ శాశ్వత ప్రతినిధిని ఆదేశించామని ప్రధాని చౌదరీ మహమ్మదాలీ తెలియజేశాడు. మొరాకో, ఆల్జీరియా ప్రజలపట్ల తమ సానుభూతి వెల్లడించాడు. ప్రతిపక్షనాయకుడు హెచ్. యస్. సుహ్రావర్దీకూడ ప్రధాని ప్రకటనను బలపరిచాడు. ఈ సమస్యను చర్చించడానికి ప్రత్యేక సమావేశం జరపాలని మియాన్ ఇఫ్తికారుద్దీన్ కోరాడు.

## తెల్లవారిపట్ల అసహ్యం

### చదువులకు కూడా భంగం కలుగుతున్నది

జోహాన్సుబర్గ్, సెప్టెంబరు 1: దక్షిణాఫ్రికాలోని ఒకే ఒక ఆఫ్రికన్ విశ్వవిద్యాలయం ఫోర్ట్ హేర్‌లో పరిస్థితులు ఎలావున్నదీ విచారణసంఘం తమ నివేదికలో వెల్లడించారు. ఈ కళాశాలలను రాజకీయ పోరాటాలకు శిక్షణ కేంద్రాలుగా విద్యార్థులు భావిస్తున్నారట. తెల్లవారంటే తగని అనుమానం, అపనమ్మకం, పెంపొందించుకొంటున్నారట. చీటికి మాటికీ అధికారులను ధిక్కరించడం మామూలైందట.

ఈ విశ్వవిద్యాలయ కళాశాలలో 370 మంది చదువుకొంటున్నారు. దీనిని గత మేలో మూసివేశారు. ఇందులో విద్యార్థులు రహస్యసంస్థలు ఏర్పాటు చేశారన్న నెపంతో ఇలాచేశారు. ప్రస్తుత పరిస్థితి చాలా ప్రమాదకరంగా వుంటగలదని, ఇది మారడానికి గట్టి చర్యలు తీసుకోవాలని యీ నివేదికలో సూచించారు.

## విజయనగర రాజుల నాణెములు

బొంబాయి, సెప్టెంబరు 2: ఉత్తర కనరా జిల్లాలో ఒక చెరువును త్రవ్వుతూవుండగా 16 వ శతాబ్దినాటి విజయనగరరాజుల బంగారునాణాలు 145 దాకా దొరికాయి. వీటిని బొంబాయిలోని ప్రిన్స్ ఆఫ్ వేల్సు ప్రదర్శనశాలకు అప్పగించారు. ఇవి అజ్జిహళ్లి అనే గ్రామంలో భూమిఅడుగున ఒక కుండలో వున్నాయి.

ఈ 145 నాణాలలోను 138 ప్రతాపరాయలకాలంనాటివి. ఇవి అరులింగాయత్ పగోడాలు, మరో 11 ఇతర నాణాలు, రెండుగాజులు, ఒక ముక్కెర ఈ కుండలోవున్నాయి.

## ఆంధ్ర సంక్షేమ పథకాలు

### ఢిల్లీలో చర్చలు

న్యూఢిల్లీ, సెప్టెంబరు 1: ఆంధ్ర ప్రభుత్వ విద్యుచ్ఛక్తి, సాంఘిక సంక్షేమ శాఖల మంత్రి గౌతులచ్చన్నగారు కేంద్ర సంక్షేమమండలి అధ్యక్షురాలు శ్రీమతి దేశముఖ్, ఆర్థిక మంత్రి శ్రీ చింతామణి దేశముఖ్ గారలను వారిబసలో నిన్న కలుసుకొని ఆంధ్ర ప్రభుత్వం తలపెట్టిన సంక్షేమ కార్యక్రమాలూ, లజితర అభివృద్ధి కార్యక్రమాలను చర్చించారు.

అఖిలభారత కాంగ్రెసు అధ్యక్షుడు శ్రీ యు. ఎన్. ధేబర్, ప్రధాన కార్యదర్శి శ్రీ మాధవన్‌నాయర్ గారలను కూడా లచ్చన్నగారు కలుసుకొని ఆంధ్రలో కాంగ్రెసు వ్యవహారాలను చర్చించారు.

## వలస వాదాలకు టర్కీ వత్తాసు

### సైప్రెసకు స్వాతంత్ర్యం ఇవ్వ వీలుకాదట

లండన్, సెప్టెంబరు 1: సైప్రస్ ప్రజలకు స్వయం నిర్ణయాధికారం ప్రసాదించాలని గ్రీసు ప్రతినిధి చేసిన విజ్ఞప్తిని టర్కీ ప్రతినిధి ఫతీన్ జోర్లు నిరాకరించాడు. త్రైపాక్షిక సంప్రదింపులలో నేడు ఆయన ప్రసంగిస్తూ యీ దీవిపై గ్రీసు అధికారాన్ని టర్కీ ఎన్నడూ ఆమోదించదని స్పష్టం చేశాడని అధికార వర్గాలవారు చెప్పారు. సైప్రెస్‌లోని 380 వేల మంది టర్కీ జాతీయుల తరఫున ఈయన మాట్లాడాడట.

"1923లో జరిగిన లాసేన్ సంధి ప్రకారం సైప్రెస్‌ను బ్రిటిష్ వారికి దత్తంచేశారు. కనుక బ్రిటిష్ ఆధిపత్యం కొనసాగాల్సిందే. టర్కీ రక్షణ ప్రయోజనాల దృష్ట్యా ఇది చాలా ముఖ్యం" అని జోర్లు చెప్పాడు.

## 8 మాసాల్లో 8 వేల హత్యలు

లండన్, సెప్టెంబరు 1: కీన్యాలో గత 8 మాసాలలోను పరిస్థితి అభివృద్ధి చెందుతున్నందున బ్రిటిష్ పదాతి, సైనానికదళాల సంఖ్యను తగ్గిస్తున్నట్లు యుద్ధకార్యాలయం ప్రకటించింది. శాంతిభద్రతల స్థాపనకు పోలీసు, రిజర్వుదళాలు చాలనీ, ఎక్కడో కొనురు గామాత్రమే సైన్యాన్ని వుపయోగిస్తామని ప్రకటనలో పేర్కొన్నారు.

1953 అక్టోబరునుంచి ఇప్పటివరకు 8 వేలమందికి పైగా నే మావ్ మావ్ విప్లవకారులను సైనికదళాలు చంపివేశాయి. ఈ ఏడాది మే ఆఖరు వరకు 20 మంది బ్రిటిష్‌సైనికులు మరణించారు. 31 మంది గాయపడ్డారు. 1952 అక్టోబరునుంచి ఈ ఏడాది జూన్‌వరకు 24188 ఆఫ్రికన్లను నిర్బంధంలో వుంచారు.

### కికుయుూను చంపుతే 18 నెలల ఖైదు మాత్రం

నైరోబీ, సెప్టెంబరు 1: ఒక కికుయూ ఖయిదీని కస్టడిలో యమయాతనలకు గురిచేసి చంపిన నేరానికి ఇద్దరు యూరపియన్ పోలీసు ఇన్‌స్పెక్టర్లు 18 నెలల కఠిన శ్రమ చేయాలని శిక్షవిధించారు. వీరిద్దరు తమ నేరాన్ని చివరకు అంగీకరించారు.

## ఆంధ్ర శాసనసభ

### ఈనెల 22 నుంచి సమావేశం

కర్నూలు, సెప్టెంబరు 2: ఆంధ్ర శాసనసభ సభాపతి ఆర్. ఎల్. ఎన్. దొరగారు, యీ నెల 22వ తేదీన శాసనసభ సమావేశాన్ని యేర్పాటు చేశారు. ఈ సమావేశం సుమారు 4 వారాలపాటు జరుగుతుంది. అదనపు పన్నుల ప్రతిపాదనలు సహా, ముఖ్యమైన కొన్ని బిల్లులు శాసనసభలో ప్రవేశపెట్టబడతవి.

## ఆంధ్ర ప్రభుత్వ ఋణం

### రు 30895 వేలు వసూలు

కర్నూలు, సెప్టెంబరు 2: రెండవ దఫా ఆంధ్రప్రభుత్వం కోరిన రు 2 కోట్ల ఋణానికి-రు 30895100 వసూలైనట్లు అధికార వర్గాల ద్వారా తెలిసింది.

5 వేలకు పైగా వచ్చిన మొత్తాలలో 5 వేలకు తగ్గకుండా, నూటికి 75 వంతులు ఉంచుకొని, మిగతా డబ్బు వాపసు చేస్తామని స్టేటు బ్యాంకు తెలియపరచినట్లు తెలిసింది.

జిల్లాలవారీగా వసూలైన మొత్తములు: శ్రీకాకుళం: రు. 9.35,500, విశాఖపట్నం: రు. 3,87,400, తూర్పుగోదావరి: రు. 7,71,600, పశ్చిమగోదావరి: రు. 16,31,600, కృష్ణా: రు. 90,86,800, గుంటూరు: రు. 4,55,900, కడప: రు. 5,95,700, కర్నూలు: రు. 2,12,000, (యిది మొదటిరోజు వసూలైన మొత్తం) నెల్లూరు: 15,06,400; చిత్తూరు: రు. 10,08,200, అనంతపురం: రు. 8,18,400.

## రెండు కొత్త ధాతువులు

### ఐన్‌స్టీన్, ఫెర్మీలపేర్లు పెట్టాలని సూచన

షికాగో, సెప్టెంబరు 1: ఈ మధ్య అమెరికన్ శాస్త్రజ్ఞులు కనిపెట్టిన రెండు కొత్తధాతువులకు ఇటీవలే కీర్తిశేషులయిన ప్రముఖశాస్త్రజ్ఞులు ఐన్‌స్టీన్, డా॥ ఎన్రికో ఫెర్మీల పేర్లు పెట్టాలని సూచించబడింది.

99వ ధాతువు, 100వ ధాతువు అని ప్రస్తుతం పిలవబడుతున్న ఈ ధాతువులను షికాగో సమీపంలో ఉన్న ఆర్గాన్ నేషనల్ లాబొరేటరీ శాస్త్రజ్ఞులు, న్యూమెక్సికో రాష్ట్రంలోని లాస్ అలమాస్ పరిశోధన కేంద్రం శాస్త్రజ్ఞులు, కాలిఫోర్నియాలోని బెర్క్లీ అణుకిరణ ప్రసార పరిశోధన కేంద్ర శాస్త్రజ్ఞులు కలిసి కనిపెట్టారు.

99వ ధాతువు అంటే దాని అణుకేంద్రంలో 99 ప్రోటాన్లు (ఘన విద్యుత్కణాలు) ఉంటవి. 100వ ధాతువు యొక్క అణుకేంద్రంలో 100 ప్రోటాన్లు ఉంటవి. ఇంతకు ముందు యురేనియం కన్నా ఎక్కువ ప్రోటాన్లు (యురేనియంలో 92 ప్రోటాన్లు) ఉన్న అణువులు ఉండవీలులేదని, అంత కన్నా ఎక్కువ ప్రోటాన్లు ఉంటే అణుకేంద్రం తక్షణం విచ్ఛిన్నమవుతుందనీ భావించబడేది.

99వ ధాతువుకు ఐన్‌స్టీనియం అనీ (దీనికి గుర్తు 'ఇ') 100వ ధాతువుకు ఫెర్మియం అనీ (దీనికి గుర్తు 'ఎఫ్. ఎం.') పెట్టాలని ఈ పరిశోధన కేంద్రాల శాస్త్రజ్ఞులు సూచించారు.

## మతాదాయ శాఖ ఉద్యోగాలు

### ప్రభుత్వ ఆలోచనలో కొత్తనిబంధనలు

కర్నూలు, సెప్టెంబరు 2: మతాదాయ శాఖలో ఉద్యోగులను నియమించడానికి అనుసరించదగు కొత్త నిబంధనలను రూపొందించే విషయం ప్రభుత్వం ఆలోచనలో ఉన్నదని దేవాదాయ ధర్మాదాయ శాఖ మంత్రి కల్లూరి చంద్రమౌళిగారు "ఆంధ్ర పత్రిక" ప్రతినిధికి చెప్పారు. ఇకముందు ఈ శాఖలోకి సంస్కృతం తెలిసిన వారినీ, కొంతకు కొంతగానైనా మత విషయాలు తెలిసిన వారినీ ఉద్యోగులుగా ప్రభుత్వం నియమిస్తారు, రాష్ట్రంలోని దేవాలయాలన్నింటి నిర్వహణనూ చక్కపరచడానికి అవసరమైన చర్యలన్నీ తీసుకుంటాము. ఇందుకవసరమైన చట్ట సవరణను త్వరలో ప్రతిపాదిస్తారు. అర్చకులకూ, ఈ శాఖలో ఇతర ఉద్యోగులకూ కూడా శిక్షణ ఇప్పించడానికి అవసరమైన పాఠ్యాంశాలను తయారు చేయించాలని ప్రభుత్వం అనుకుంటున్నారు. ఆంధ్రలోని ముఖ్యమైన దేవాలయాలన్నింటి చరిత్ర శిల్ప వైభవం మొదలైన ముఖ్య విషయాలను వివరించే ప్రత్యేక సంచిక ఒకటి ప్రచురించాలను కుంటున్నాము."

## గుంటూరు జిల్లా కాంగ్రెసు ఎన్నికలు,

### దుగ్గిరాల, పేటేరు క్రోసూరు ఫలితాల నిలుపుదల

విజయవాడ, ఆగస్టు 31: ఆంధ్ర ప్రదేశ కాంగ్రెసు ఎన్నికల నిర్వహణోద్యోగి నాదముని రెడ్డిగారు తమ విధులను ప్రదేశ కాంగ్రెసు కార్యవర్గ శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి పరంచేసినట్లు తెలుస్తున్నది. ఈఅధికారాలను పురస్కరించుకొని గుంటూరు జిల్లాలోని దుగ్గిరాల, పేటేరు, క్రోసూరు నియోజకవర్గ ఎన్నికల ఫలితాలు ప్రకటించరాదని జిల్లా ఎన్నికోద్యోగికి ఆఫీసరుకు తాఖీదులు పంపినట్లు తెలుస్తున్నది.

కాంగ్రెసు నియమావళి ప్రకారం ఎన్నికోద్యోగి తమ విధులను ఎవ్వరికీ వప్పజెప్పటకు వీలులేదని తెలుస్తున్నది. ఎన్నికోద్యోగి ఏ ఎన్నిక పదవులలో నుండరాదని గూడ నిబంధనలలో వున్నట్లు తెలుస్తున్నది. (స్వ. వి)

## జనవరి నాటికి కొత్త పురపాలక సంఘాలు

కర్నూలు, సెప్టెంబరు 2: జనవరి నాటికి, కొత్త పురపాలక సంఘాలు అధికారంలోకి రాగలవని, స్థానిక సంస్థల పరిపాలనామంత్రి డా॥ ఎ. బి. నాగేశ్వరరావుగారు చెప్పారు.

చట్టాన్ని సవరించడానికి సంకల్పించిన బిల్లు వచ్చే శాసనసభ సమావేశంలో చర్చకు వస్తుందని ఆయన అన్నారు.

## భూసంస్కరణలు

కర్నూలు, సెప్టెంబరు 2: భూమి సంస్కరణల సంఘ నివేదిక, ఒక నెల రోజుల్లోపల ప్రభుత్వానికి అందవచ్చునని తెలుస్తున్నది. ఆ సంఘంవారు ప్రస్తుతం నివేదిక పనిలో నిమగ్నమై ఉన్నారు.

## కరాచీ గోవాలమధ్య విమాన ప్రయాణాలు

### పాకిస్థాన్‌కు హెచ్చరిక చేసినట్లు శ్రీ నెహ్రూ వెల్లడి

### బాండుంగ్‌సభదేశాలుశ్రద్ధతీసికొనాలనిభావం

న్యూఢిల్లీ, సెప్టెంబరు 2: కరాచీనుంచి గోవాకు పోర్చుగీస్ విమానాలు తిరుగుతున్నందుకు భారతప్రభుత్వం పాకిస్థానుకు ఒక హెచ్చరికచేసింది. కాని ఇంతవరకూ దానివల్ల ఏట్టి ఫలితం కలగలేదు" అని ప్రధాని నెహ్రూ నేడు రాజ్యసభలో ప్రశ్నలకు జవాబిస్తూ వెల్లడించారు.

ఈ వ్యవహారంలో పాకిస్థాన్ ప్రభుత్వాన్ని జోక్యం కలిగించుకోవలసిందిగా భారత ప్రభుత్వం కోరినట్లు పాకిస్తాను ప్రభుత్వానికి తెలియదని నేటి ఉదయం పత్రికల్లో వచ్చిన వార్తలను సభ్యులు ఉదహరించారు. దానికి నెహ్రూ జవాబిస్తూ, ఆ వార్తలోనే కౌనుసెల్లు వ్యవహారాల కార్యదర్శి ఢిల్లీలోని పాకిస్థాన్ హైకమిషనర్‌ని ఈ విషయమై అడిగినట్లుకూడా ఉన్నది కదా అని అన్నారు.

బాండుంగ్ సభలో పాల్గొన్న దేశాలన్నీ వలసవాదాన్ని ప్రతిఘటించే టప్పుడు అంతాకలిసి గట్టిచర్యతీసుకోవాలికదా అని భూపేశ్ గుప్తా ప్రశ్నించారు. దానికి నెహ్రూ జవాబిస్తూ "నేను అట్లాగే అనుకుంటున్నాను." అని జవాబిచ్చారు.

దీనికిముందు ఎం. గోవిందరెడ్డిగారి ప్రశ్నకు ఉపవిదేశాంగమంత్రి శ్రీ చాందా జవాబిస్తూ 1955 ఆగస్టునుంచీ కరాచీ, పోర్చుగీస్ ఆక్రమిత భారత ప్రాంతాలమధ్య విమానప్రయాణాలు సాగుతున్నవనీ, ఇవి భారతభూభాగం మీదుగా జరగలేదనీ తెలియజేశారు. భారత ప్రాంతీయ జలహద్దులలోపల ఎగిరినవోలేదో తెలియదని అన్నారు.

"1954 లో గోవా, దయ్యూ, ధామన్‌లనుంచి 28,616 మంది ప్రజలు భారతదేశానికివచ్చేశారని చాందాగారు మరొక ప్రశ్నకు జవాబిస్తూ తెలియజేశారు.

వీరందరినీ తీవ్రంగా కొట్టి త్రోసేశారు. మజాలీ సరిహద్దునుంచి ప్రవేశించిన దళాలలో ఇది పదిహేనవది. మంగళవారం రాత్రి ప్రవేశించిన 25 మందిని కూడ గతరాత్రి వెనక్కి నెట్టేశారు.

దయ్యూకు పాకిస్తాన్‌నుంచివిమానాలలో దైనందిన జీవితావసర వస్తువులు వస్తున్నాయని రాజకోటనుంచి వార్తలు వస్తున్నాయి. రెండు నెలలక్రితం దయ్యూవద్ద ఒక విమానాశ్రయాన్ని నిర్మించారట.

### దయ్యూలో అశాంతి

దయ్యూలో రహస్యోద్యమాన్ని అణచివేసేందుకు పోలీసులు ఇండ్లపై దాడులు జరుపుతున్నారు. నాయకుల ఆచూకీ ఇవ్వకపోతే కాల్చిపారేస్తామని బెదిరిస్తున్నారు. గోడలమీద, చెట్లమీద పోర్చుగీసు వ్యతిరేకనినాదాలు రోజా తెల్లవారేసరికి ప్రత్యక్షమవడంతో వాళ్ళపని మరీ ఉక్కిరిబిక్కిరిగా వున్నదట.

గోవాలోని భారత కౌన్సల్ జనరలు శ్రీ మణి నేడిక్కడకు వచ్చారు. పంజిం నుంచి భారత సరిహద్దువరకు మార్గోవా పోలీసు కమిషనరు వెంటవచ్చారని చెప్పారు. గోవా పరిస్థితులగురించి విలేఖరులకు చెప్పనిరాకరించారు. ప్రభుత్వానికి వెంటనే తెలియజేస్తామన్నారు తరువాత ఆయన బెల్గాంమీదుగా ఢిల్లీకి బయలుదేరారు.

### సైనిక న్యాయస్థానం విధించే శిక్షలు

పలువురు గోవన్లకు ఇద్దరు భారతీయులకు గోవాసైనిక న్యాయస్థానం ఏడాదినుంచి తొమ్మిదేళ్ళ వరకు ఖైదు శిక్షలు విధించిందని పంజింనుంచి వార్తచేరింది. వీరందరు జనవరి 26 న అరెస్టయ్యారు భారతీయులిద్దరికీ 9 సంవత్సరాల శిక్ష, జరిమానా, కూడ విధించారు. ఇందులో ఒకనిపేరు శ్రీ రామశంకర్ శ్రీ శర్మ.

పంజింలో నిర్బంధంలోవున్న గోవా సత్యాగ్రహ దళాల నాయకులు శ్రీ రాజారాం పాటిల్, త్రిదీబ్ చౌదరి, మధులిమాయే, ఆత్మారాం పాటిల్ గారలను త్వరలో విచారిస్తారని తెలిసింది. గోరే, లిమాయేల, తరఫున వాదించడానికి ప్రముఖ పూనా న్యాయవాది శ్రీ కె. యస్. ఫాడ్కే రెండు రోజుల్లో గోవా వెళుతున్నారు. శ్రీమతి సుధాబాయ్ జోషీ నికూడా విచారిస్తున్నారు. శ్రీ గోరే, యస్. పి. లిమాయేల విచారణ సెప్టెంబరు 10 నాటికి వాయిదావేశారు. వీళ్ళమీద నేరారోపణ అప్పుడేచేసి విచారణ ప్రారంభించారు.

గోవాలో నిర్బంధంలో వున్న జస్వంత మెహతా తదితర సత్యాగ్రహుల ఆరోగ్యం బాగానేవుందని దయ్యూ గవర్నరు రాజకోటనుంచి ఒకరు పంపిన టెలిగ్రాంకు సమాధానమిచ్చారు.

## కాంగ్రెసు కార్యవర్గ చర్చలు

### సత్రమ సత్యాగ్రహానికి సభ్యుల సుముఖత

న్యూఢిల్లీ సెప్టెంబరు 2: కాంగ్రెస్ కార్యవర్గం గోవా సమస్యను నేటి ఉదయం చర్చించారు. ఈ చర్చ ఇంకా పూర్తికాలేదు కాని కాంగ్రెస్ వారిని వ్యక్తిగతంగా గోవా సత్యాగ్రహంలో పాల్గొనడమును గూర్చి ఇది జరిగినట్లు తెలుస్తున్నది.

ఈ చర్చలలో బహురకాల భావాలను వ్యక్తం చేసారని, ఎవరి భావాలు ఎట్లా వున్నా, ఏదోవిధంగా ఈ ఉద్యమంలో కాంగ్రెస్ వారు ప్రభుత్వ విధానానికి వ్యతిరేకం కాని పద్ధతిలో పాల్గొనడమే మంచిదని అధిక సంఖ్యాకులు భావిస్తున్నట్లు తెలియ వస్తున్నది.

ఇవాళ మధ్యాహ్నం జరిగే సమావేశంలో ఈ విషయంపై ఏదో ఒక నిర్ణయం చేస్తారు. ప్రభుత్వ విధానానికి విరోధంలేని విధంగా ఈ సత్యాగ్రహంలో పాల్గొనడం సాధ్యమే అయిన పక్షంలో, కాంగ్రెస్ వారికి ఇవ్వవలసిన ఆదేశాల విషయం గూడా కాంగ్రెస్ కార్యవర్గం ఆలోచిస్తారు.

నేటి ఈ సమావేశంలో కాంగ్రెస్ పార్టీ కేంద్ర ఎన్నికల సంఘాన్ని ఎన్నుకునే కార్యక్రమ విధానాన్ని నిర్ణయించడానికి ఆలోచనలుజరిగాయి. ఈ సంఘానికి 7 సభ్యులను ఎన్నుకోవలసివుంది. వీరిని ఎట్లా ఎన్నుకోవాలో నేను కార్యవర్గం నిర్ణయించారు.

అనంతరం కార్యవర్గం రేపు జరిగే అ. భా. కాం. సం. సమావేశ కార్యక్రమాన్ని చర్చనీయాంశాలను ఆలోచించారు. ఈ సంఘ సమావేశం కాంగ్రెసు అధ్యక్షుని ప్రారంభోపన్యాసాలతోను, శ్రీ నెహ్రూ ప్రసంగంతోను ప్రారంభమౌతుంది. ఆ అనంతరం ఈ సంఘం మూడు బృందాలు క్రింద విడిపోయి పంచవర్ష ప్రణాళిక గ్రామపరిశ్రమలు, కాంగ్రెసు వ్యవసను సంబంధించిన విషయాలు చర్చిస్తారు. ఇందులో మొదటబృందం రెండో పంచవర్ష ప్రణాళికను చర్చిస్తుంది. దీనికి శ్రీ నందా అధ్యక్షతవహిస్తారు. రెండో బృందం శ్రీ వి. ఎల్. మెహతా అధ్యక్షతను గ్రామపరిశ్రమలపై చర్చిస్తుంది. శ్రీ లాల్ బహదూర్ శాస్త్రి అధ్యక్షతను మూడో బృందం కాంగ్రెసు వ్యవస్థలోని సమస్యలను చర్చిస్తుంది.

నేను కార్యవర్గం రెండో ప్రణాళికపై గూడా కొంతసేపు చర్చ చేసినట్లు తెలుస్తున్నది.

## 15వ సత్యాగ్రహదళం

కొల్వార్, సెప్టెంబరు 1: ఈఉదయము గోవాలో సత్యాగ్రహం జరపడానికి ప్రవేశించిన 71 మంది భారతీయులను వెనక్కి నెట్టేశారు. గుజరాత్ ప్రతికారవయిత శ్రీ ప్రేంచంద్ షైక్ యీజట్టుకి నాయకత్వం వహించాడు.

## పశ్చిమగోదావరి వరద బాధితులకు రూ 60 వేలు

### ఆహారధాన్యాల పంపిణీకోసం మరొక రు 2 వేలు మంజూరు

కర్నూలు, సెప్టెంబరు 2: పశ్చిమ గోదావరిజిల్లాలో ఇటీవల కురిసిన కుంభవర్షాల కారణంగా పడిపోయిన ఇండ్ల యజమానులకూ, పాడైపోయిన ఇండ్ల యజమానులకూ కుటుంబానికి రూ 30 కు మించకుండా ధనసహాయం చేసే నిమిత్తం ఆంధ్రప్రభుత్వం రూ 60 వేలు మంజూరుచేశారని రెవిన్యూమంత్రి కల్లూరి చంద్రమౌళిగారు ఈవేళ "ఆంధ్రపత్రిక" ప్రతినిధికి చెప్పారు.

కొవ్వూరు, తణుకు, తాడేపల్లిగూడెం, పోలవరం తాలూకాలలో వానల వల్ల నిరాశ్రయులైనవారికి ఆహార ధాన్యాలు సప్లయిచేసే నిమిత్తం ప్రభుత్వం మరో రూ 2 వేలు మంజూరు చేశారని కూడా రెవిన్యూ మంత్రి అన్నారు.

ఇండ్లు తిరిగి కట్టుకునే నిమిత్తం సుమారు 2 వేలమందికి సహాయం చేయవలసి ఉంటుందని అంచనా.

## నందికొట్కూరు తాలూకాలో వరదనష్టం

### శాసనసభ్యుని విజ్ఞప్తి

కర్నూలు, సెప్టెంబరు 2: ఇటీవల సంభవించిన కుంభవర్షంవలనా, కృష్ణానది వరద మూలంగానూ నష్టపడిన గ్రామస్థులు తిరిగి ఇండ్లు కట్టుకోవడానికి ప్రభుత్వం వెంటనే తగు సహాయం చెయ్యాలనిఅభ్యర్థిస్తూ నందికొట్కూరు నియోజకవర్గం శాసనసభ్యుడు ఇ. అయ్యపురెడ్డిగారు రెవిన్యూమంత్రి శ్రీ చంద్రమౌళి, సహకారశాఖమంత్రి సంజీవయ్యగారల కొక విజ్ఞప్తి సమర్పించారు.

అందులో ఇట్లా ఉన్నది: "ఇటీవల కుంభవర్షాలు రావడంవల్ల, ఆ తరువాత కృష్ణానది పొంగడంవల్లనూ నందికొట్కూరు తాలూకాలో కృష్ణానది ఒడ్డునవున్న సిద్ధేశ్వరం, సంగమేశ్వరం, కపిలేశ్వరం మొదలైనగ్రామాలకు చాలా నష్టం సంభవించింది. రోడ్లన్నీ నామరూపాయలులేకుండా చెడిపోయినవి. ఆ గ్రామాలకు పరిసరప్రాంతాలతో సంబంధంలేకుండా పోయింది. వరదలలో కొన్ని ఇండ్లు కొట్టుకుపోయినవి ఇండ్లలోని వస్తువులన్నీ కొట్టుకుపోయినవి. పొలాలు నీట్మునుగుమైనవి. వాటిలోఉన్న పంట నష్టమైంది. ఇక కొన్ని సంవత్సరాలవరకూ సాగుచెయ్యడానికి వీలులేకుండా పొలాలు పాడైపోయినవి. పొలాలలో భూమి సారమంతా కొట్టుకుపోయి, పెద్దపెద్ద రాళ్లువచ్చి పడినవి. అనేక పూరిండ్లూ, పెంకుటిండ్లూ నేల గూలినవి. చాలామంది నిరాశ్రయులైనారు. వారందరికీ ప్రభుత్వం వెంటనే తగు సహాయం చెయ్యాలి."

సానుభూతితో పరిశీలిస్తామని మంత్రులు సమాధానం చెప్పారు.

## అక్కడక్కడా వానలు

మదరాసు, సెప్టెంబరు 2: ఆంధ్ర కోస్తాలో అక్కడక్కడ జల్లులుకొట్టాయి. కాకినాడలో -4 చుక్కల వర్షం పడ్డది. 4 వ తేదీ ఉదయంలోగా శ్రీకాకుళం, విశాఖపట్నం, ఉభయ గోదావరీలు, కర్నూలు, గుంటూరు, నెల్లూరు, ఉత్తర హైదరాబాదులంగ జల్లులుపడే సూచనలు కనబడుతున్నవి.

### శీతోష్ణస్థితి

| కేంద్రం | అత్యధికోష్ణం డిగ్రీలు | అల్పోష్ణం డిగ్రీలు |
|---|---|---|
| కళింగపట్నం | 84 | 78 |
| గన్నవరం | 87 | 75 |
| కాకినాడ | 85 | 72 |
| బందరు | 87 | 75 |
| నెల్లూరు | 97 | 77 |
| ఒంగోలు | 95 | 76 |
| రెంటచింతల | 90 | 74 |
| విశాఖపట్నం | 84 | 78 |
| అనంతపూరు | 98 | 75 |
| ఆరోగ్యవరం | 88 | 79 |
| కడప | 94 | 78 |
| కర్నూలు | 91 | 74 |
| హైదరాబాదు | 86 | 74 |
| మదరాసు | 94 | 74 |
| బెంగుళూరు | 81 | 67 |
| బళ్లారి | 88 | 75 |
| న్యూఢిల్లీ | 98 | 78 |

## పాలూరులో నీటి సుంకం

కర్నూలు, సెప్టెంబరు 2: పాలూరులో 1955 అక్టోబరు ఒకటవ తేదీ నుంచీ, నీటి సుంకం మురుగు పారుదల పన్ను — అర్ధ సంవత్సరానికి 8¼% చొ॥ న విధించడానికి ప్రభుత్వం పురపాలక సంఘానికి అనుమతి యిచ్చింది. ఇందులో 8% నీటి సరఫరా పనుల కోసం, ¼% మురుగుపారుదల పనుల కోసం విధించ బడుతుంది.

### అనంతపురం వార్డుల పునర్విభజన

కర్నూలు, సెప్టెంబరు 2: పట్టణం హద్దులువిస్తృతం చేయడంవల్ల, పురపాలకసంఘం వార్డులు 21 గా పునర్విభజించారు. 4, 5 వార్డులు స్త్రీలకు, 9 వ వార్డు షెడ్యూల్డు జాతులకు ప్రత్యేకించబడినవి.

కర్నూలు, సెప్టెంబరు 2: రాజమండ్రి విద్యుచ్ఛక్తి సరఫరా సంస్థను స్వాధీనం చేసుకోవడానికి ప్రభుత్వం నిశ్చయించింది.

# ఎన్నికల అభ్యర్థుల నిర్ణయంలో కుల ప్రసక్తి ఉండరాదు

## ప్రదేశ కాంగ్రెసు అధ్యక్షుల సమావేశ అభిప్రాయం

న్యూఢిల్లీ, సెప్టెంబరు 1: వచ్చే ఎన్నికలకు అభ్యర్థుల్ని ఎంచుకోనటంలో కులప్రసక్తి ఎంతమాత్రమూ పనికిరాదని నేడిక్కడ సమావేశమయిన రాష్ట్రకాంగ్రెస్ అధ్యక్షులు, కార్యదర్శులు భావిస్తున్నారు. వ్యక్తుల యోగ్యత, వారి గత చరిత్రలను మాత్రమే అభ్యర్థుల నియామకంలో పాటించాలని వారంతా ఏకాభిప్రాయానికి వచ్చారు.

కుల తత్వాన్నీ, మత తత్వాన్నీ నిర్మూలించేందుకు అఖిలభారత కాంగ్రెస్ సంఘపు స్థాయి సంఘం చేసిన సూచనను చర్చిస్తున్న సందర్భంలో ఈ అభిప్రాయాన్ని వెల్లడించారు. దీనిని అమలు జరపటంలో కొన్ని ఇబ్బందులున్నా, వాటిని అధిగమించవలసిందేనని అందరూ ఒప్పుకొంటున్నారు.

అధ్యక్షుల, కార్యదర్శుల సమావేశం ఈ రోజున 9 గంటలసేపు సాగింది. ప్రధాని నెహ్రూ, కాశ్మీర్ ముఖ్యమంత్రి గులాం మహమ్మద్ ప్రత్యేకాహ్వానంమీద ఈ సమావేశంలో పాల్గొన్నారు. వీరిద్దరూ సమావేశంలో మాట్లాడుతూ ఇంకా దేశంలో కులమతతత్వాలు విజృంభించి ఉన్నందుకు విచారం తెలుపుతూ, ఈ తత్వాలు సమాజాన్ని కొల్లగొడుతున్నవని అన్నారు.

### దేశానికి ప్రబలశత్రువు కులతత్వమే

నెహ్రూగారు తన ప్రసంగంలో ఈ కింది విధంగా విమర్శించారు: "కులతత్వం అన్నది కేవలం మన ఒక్క దేశంలోనే కనిపిస్తున్నది. ఈ పద్ధతిలో ఈ కీడు మరే దేశంలోనూ లేదు. దేశానికి ప్రబల శత్రువు కులతత్వమే. దేశం అంతకాలం పాటు బానిసగా ఉండటానికి కూడా ఇదే కారణం. దీనిని సమూలాగ్రం నిర్మూలించవలసిందే. అంతా కలిసి నిలబడి ఈ జాడ్యాన్ని ఎదుర్కోవాలి."

"దీనిని పరిహరించే విషయంలో నిష్కృష్టమయిన నిబంధనలను తయారు చేయటం కష్టం. అయితే ఇందులో ఉన్న ప్రమాదాన్ని ప్రతి కాంగ్రెస్ వాదీ గుర్తించి నడుచుకోవాలి. దేశం బలపడాలంటే కులమత తత్వాలకు స్వస్తి చెప్పవలసిందే. అది జరగకపోతే దేశ భవిష్యత్తు అంధకారమయం అవుతుంది."

బక్షీ గులాం మహమ్మద్ మాట్లాడుతూ దేశంలో మతవర్గ సంస్థల పేర్లనూ, వాటి సభ్యత్వ సంఖ్యలను సేకరించి, అందులో కాంగ్రెస్ వారు చేరకుండా చర్య తీసుకోవాలని హెచ్చరించారు. రాజకీయాల్లో పాల్గొంటున్న మతసంస్థలనేకం ఉన్నవనీ, కాంగ్రెసువాదులు వాటికి ఎడంగా ఉండాలనీ ఆయన హెచ్చరించారు.

### ప్రతిజిల్లాలోనూ కాంగ్రెసు సంఘం

సాయంత్రం సమావేశంలో కుల, మత తత్వాలమీద స్థాయి సంఘం చేసిన సిఫార్సులమీద చాలసేపు చర్చ జరిగినా, కాంగ్రెసుసంస్థ పునర్నిర్మాణం, బలిష్ఠం చేయటంవంటి సమస్యలు కూడా చర్చించారు. ఇటీవల రాష్ట్ర కాంగ్రెసుసంఘ కార్యాలయాలను పటిష్ఠంచేయటానికి జరిగిన కృషిలో కనిపించిన అభివృద్ధికి సమావేశం సంతృప్తి వెల్లడించింది.

డిసెంబర్ చివరనాటికల్లా దేశంలో తగిన సిబ్బందితో సక్రమజిల్లా కాంగ్రెసు సంఘం ఏర్పాటు కాని జిల్లా అంటూ ఉండకూడదన్న ఆశను వెల్లడించింది. కాంగ్రెసు ప్రాథమిక సభ్యుల్ని చేర్చుకోవటం మొదలు అఖిలభారత కాంగ్రెసుసంఘ ఎన్నికలవరకూ కాంగ్రెసు నియమావళిని అమలుజరిపి, సుస్థిర వాతావరణాన్ని నెలకొల్పాలనికూడా సమావేశం సూచించింది.

### సభ్యత్వగడువు

ప్రాథమిక సభ్యుల్ని చేర్చుకునే గడువును ఏ విధంగానైనా అవాంతరాలు వస్తే తప్ప లేకపోతే పొడిగించరాదని కార్యవర్గానికి హెచ్చరిక చేసింది. సభ్యత్వ ఫారాలు తగినన్ని లేవని స్థానిక సంఘాలు ఫిర్యాదు చేయలేదన్న ఆరోపణలు వస్తే రాష్ట్రకాంగ్రెస్ సంఘాలే వాటిని సప్లయిచేసే బాధ్యత పెట్టుకోవాలని సూచించారు.

కాంగ్రెస్ అధీన సంఘాల కార్యకలాపాలపై తనిఖీ అవసరమన్న అభిప్రాయాన్ని అనేకమంది సభికులు వెల్లడించారు. దీనివిషయమై కిందటి సమావేశంలో చేసిన నిర్ణయాలు ఇంకా పూర్తిగా అమలు కాలేదని తేలింది.

### ఎన్నికల విచారణ సంఘాలు

కాంగ్రెస్ ఎన్నికల వివాదాల విచారణ సంఘాలు సంతృప్తికరంగానే పని చేస్తున్నవి కానీ, అభ్యర్థుల అర్హతలను పరిశీలించే పరిశీలన సంఘాలు మాత్రం ఏమీ బాగా పని చేయటంలేదని సమావేశం అభిప్రాయం ప్రకటించింది. పరిశీలనసంఘాలు సరిగా పనిచేసేట్లూ, సభ్యుల జాబితాలు సరిగా ఉండేట్లూ, సమర సభ్యుల యోగ్యతలు సరిగా ఉండేట్లూ రాష్ట్రకాంగ్రెస్ సంఘాలు చూడాలని కోరబడ్డది.

### కార్యకర్తల శిక్షణ

కాంగ్రెస్ కార్యకర్తల శిక్షణకూ, విషయ బోధనకూ కొన్ని కొన్ని రాష్ట్రాల్లో జరిగిన ప్రయత్నాలను సమావేశం ప్రశంసించింది. కార్యకర్తల శిక్షణ ప్రచారసారస్వతం మొదలైన అంశాలమీద స్థాయీసంఘం చేసిన సూచనలను అమలు జరపవలసిందిగా కోరింది. డిసెంబర్ చివరనాటికి సమర్థ సభ్యులందరికీ ఒక విధిత శిక్షణనూ, జోనా తరగతులనూ పూర్తిఅయేట్లు రాష్ట్ర సంఘాలు చూడాలని హెచ్చరిక చేసింది.

### విరాళాల వసూలు

రాష్ట్ర కాంగ్రెసుసంఘం అనుమతితో కేంద్ర పార్లమెంటరీబోర్డు అనుమతిని పొందనిదే ఏకాంగ్రెసువాదీఎన్నికలకోసం విరాళాలను వసూలు చేయరాదని అఖిలభారత కాంగ్రెసు సంఘం చేసిన సూచనను సమావేశం ఆమోదించింది. వసూలుచేసిన విరాళాల లెక్కలను రాష్ట్రకాంగ్రెసు సంఘానికీ, అఖిలభారత కాంగ్రెసు సంఘానికీ సమర్పించాలని సూచించబడ్డది.

కాంగ్రెసుసంస్థకూ, అనధికార సంఘాలకూ సమన్వయం చేయాల్సిన విషయమై తమ ప్రాంతాలలో జరుగుతున్న కృషిని వరిస్తూ రాష్ట్ర కాంగ్రెసు సంఘ ప్రతినిధులు సమర్పించిన నివేదికలను సమావేశం ఆమోదించింది. వివిధాంశాలమీదనూ రాష్ట్రకాంగ్రెసు అధ్యక్షులు నివేదికలు సమర్పించారు.

### కొన్నిరాష్ట్రాలలో అంతఃకలహాలు

మొత్తంమీద కాంగ్రెసు సంస్థ పునాది సక్రమంగానే ఉన్నప్పటికీ కొన్ని రాష్ట్రాల్లోమటుకు అంతఃకలహాలు, కొన్నిచోట్ల కులమత కక్షలు ఉన్నవని కాంగ్రెసు అధ్యక్షుడు ధేబర్ సమావేశానికి ఒక నివేదికలో తెలియజేశారు. ఇటీవల దేశమంతట్లోనూ తను చూసినవాటిని వివరిస్తూ ఆయన ఆనివేదికలో ప్రస్తావించారు.

అయితే మొత్తంమీద కాంగ్రెసు పునాదేమీ సడలలేదు. కాంగ్రెసు కార్యకర్త కాంగ్రెసులో త్యాగనిరతిని కాపాడాలని చేసిన విజ్ఞప్తులను పాటిస్తూనే ఉన్నాడు. పదవీ రాజకీయాలు అన్ని వైపులనుంచీ అతణ్ని ఆవరించినా, అవి అతడి హృదయాన్ని లోబరచుకోలేదనే చెప్పవచ్చు" అని ఆయన వివరించారు.

### కాంగ్రెస్ కేవలం పార్లమెంటరీ పార్టీ కాదు

"స్వాతంత్ర్యానికి ముందువలె కాంగ్రెస్ ఇప్పుడు జాతి అంతటనీ సమీకరించే వేదిక అని చెప్ప వీలులేదు. కాని మన చరిత్రనుపట్టీ, మన సంప్రదాయాలనుపట్టీ, మన దేశ అభివృద్ధిలో ప్రస్తుత స్థితినిపట్టీ, మనం బ్రిటిష్ లేబర్ పార్టీవంటి పార్టీల వలె కేవలం పార్లమెంటరీ పార్టీగా మాత్రమే వ్యవహరించ లేమని మన సంస్థలో ఉన్న వాళ్లూ, పరిపాలన నడుపుతున్న వాళ్ళూ కూడా గ్రహించటం అత్యవసరం. దేశ భద్రతకు అనుగుణంగా ప్రజానీకాన్ని ప్రబోధించవలెనంటే కాంగ్రెస్ సంస్థకు ప్రత్యేక బాధ్యతను గుర్తించాలి. ఆంధ్ర ఎన్నికల్లో ఒక సుశిక్షితమయిన పార్టీ ప్రజాభిప్రాయాలను ఏ విధంగా మలచి, రాష్ట్రం పునాదులనే ఎలా కదలించి వేస్తుందో గమనించాము. కమ్యూనిస్టుపార్టీని బలపరచటంలో గల ప్రమాదాన్ని ప్రజలు సకాలంలో గుర్తించటం చాలా అదృష్టం. ఎల్లప్పుడూ అట్లా జరుగుతుందని మనం నమ్మకంగా అనుకోలేము" అని ధేబర్ హెచ్చరించారు.

### శ్రీ యస్. శంభుప్రసాద్

మదరాసు, సెప్టెంబరు 2: ఆంధ్రపత్రిక సంపాదకులు శ్రీ యస్. శంభుప్రసాద్ (యం ఏ) నిన్న సాయంత్రం గ్రాండ్ ట్రంక్ ఎక్స్‌ప్రెస్‌లో ఢిల్లీ నుంచి వచ్చారు.

మదరాసు, సెప్టెంబరు 2: తిరుపతి గోపురం నిర్మింప రేపు 3 వ తేదీ ఉదయం 8 గం. తిరువళ్ళికేణిలో జరుగుతుంది.

---

# వంశధార ప్రాజెక్టు

## ఈ నెలలోనే ఆంధ్ర ఒరిస్సా చర్చలు

కర్నూలు, సెప్టెంబరు 2: వంశధార ప్రాజెక్టు గురించి, ఉభయ ప్రభుత్వాలు, యీ నెలలోనే చర్చలు జరుపవచ్చునని, ఒరిస్సా ముఖ్యమంత్రి ఆంధ్ర ప్రభుత్వానికి వ్రాసినట్లు తెలిసింది.

# పార్టీతో దేశముఖ్ తగాదా సర్దుబాటు

## చేసిన నిర్ణయాలను అనుసరించాలని పట్టు

న్యూఢిల్లీ, సెప్టెంబరు 1: కంపెనీల బిల్లులో కొన్ని అంశాల విషయమై ఆర్థికమంత్రి శ్రీ దేశముఖ్ కు, కొంతమంది కాంగ్రెస్ సభ్యులకు మధ్య ఏర్పడ్డ ప్రతిష్టంభనం నేడు సర్దుబాటై పోయింది.

కాంగ్రెస్ పార్లమెంటరీపార్టీ కార్యవర్గం నేడు అత్యవసరంగా సమావేశమైనప్పుడు ఆర్థికమంత్రి కాంగ్రెస్ సభ్యులయినవారి కొంతమంది వైఖరి తనకు చికాకుగా వుంటున్నదని, కాబట్టి తనకు ఆర్థికమంత్రి పదవినుంచి తప్పుకునేందుకు అవకాశం కల్పించవలసిందని కోరారు. పార్టీలో మంత్రిమండలిలో ఈ బిల్లు స్వరూపాన్ని ఇదివరకే ఆమోదించారు. ఇప్పుడు దీనిని ఇక మార్చే బాధ్యతను తాను పెట్టుకోను అని గూడా ఆయన కార్యవర్గంలో తెలియజేసినట్లు తెలుస్తున్నది.

అనంతరం ఆర్థికమంత్రి ప్రధానమంత్రిని కలుసుకుని మాట్లాడారు. తరువాత లోక్ సభకు వచ్చారు. ఇక లోక్ సభలో చర్చలకు ఈయనే సమాధానం ఇస్తారని తెలుస్తున్నది.

రాత్రి పండిత గోవింద వల్లభపంతు కాంగ్రెసుపార్టీ సభ్యులను కొంతమందిని తనయింటికి పిలిచి మాట్లాడి, వారిని సమాధానపరచారట.

ఈ వచ్చిన వారిలో శ్రీ ఎన్. వి. గాడ్గిల్, శ్రీ సి. సి. షా ప్రభృతులు వున్నారు.

కాంగ్రెసు పార్టీలో ఈ తగాదా అంతా మేనేజింగ్ ఏజంట్ల అధికారాలను గురించి, పారితోషికాలను గురించి వచ్చినట్లు తెలుస్తున్నది. మేనేజింగ్ ఏజంట్లు ఇతర కంపెనీలకు కార్యదర్శులుగా వుండటం విషయమైగూడా ఈ తగాదా పెరిగినట్లు తెలుస్తున్నది.

### కార్యదర్శులు కోశాధిపతులు

మేనేజింగు ఏజంట్లు కార్యదర్శులు, కోశాధిపతుల విషయమై వచ్చిన తగాదా ఈ విధంగా వుంది. మేనేజింగు ఏజంటుకు బిల్లు ప్రకారం కొన్ని నియమాలు వున్నాయి. కార్యదర్శులకు కోశాధిపతులకు ఆ నియమాలు వర్తించవు. ఎందుకు వర్తింపజేయరాదని సభ్యులు ప్రశ్నించారు. ఈ ప్రశ్నకు ఆర్థికమంత్రి ఇట్లు జవాబు చెప్పారు. ప్రభుత్వానికి అన్ని అధికారాలు వున్నాయి. కార్యదర్శులను, కోశాధిపతులను నియమించుకోవాలంటే ముందు ప్రభుత్వ అనుమతిని పుచ్చుకోవాలి. అప్పుడు ఒక కంపెనీగాని, ఏదైనా సంస్థగాని తాను కార్యదర్శినని లేక కోశాధిపతినని అంటే ప్రభుత్వం నిరాకరించవచ్చు. ఒకే మనిషి పది కంపెనీలకు కార్యదర్శిగా వుంటానన్నా తిరస్కరించవచ్చు"

ఈ విధంగా జవాబు చెప్పినా కొంతమంది కాంగ్రెస్ సభ్యులు ఈ అంశాలకు సవరణలు ప్రతిపాదించారు. ఈ ప్రతిపాదనలు గూడా కాంగ్రెస్ పార్టీ ఏర్పాటు చేసుకున్న సవరణల సంఘంలో చర్చకు వచ్చాయి. ఎవరిభావాలను వారు తిరిగి సమర్థించారు. ఆర్థికమంత్రి అందరికీ నచ్చచెప్పారు. ఏదో ఒప్పందం కుదిరినట్లుగూడా పేర్కొనబడుతున్నది. కాని పార్టీ సభ్యులు మాత్రం పట్టుదల వదలలేదు. దానితో తగాదా వచ్చింది. నిన్న ఈ సంఘ సమావేశం జరిగినప్పుడు ఆ సభ్యులు తిరిగి కార్యదర్శుల కోశాధిపతుల సంగతి యెత్తారు. అప్పుడు ఆర్థికమంత్రి ఆ సంఘంలోంచి వెళ్ళిపోయారు.

నిన్న ఈ ఉదంతం అనంతరం నేడు పార్టీ కార్యవర్గం ఈ విషయాన్ని చర్చచేసింది. ఇందులోగూడా చర్చలు మాటగా జరిగినట్లు తెలుస్తున్నది. ఒక సందర్భంలో శ్రీ దేశముఖ్ పరిస్థితి ఇట్లా వుంటే తాను బిల్లును నడిపించే బాధ్యతను వహించనని అన్నట్లుగూడా తెలుస్తున్నది.

సాయంత్రం కొంతమంది ప్రముఖ సభ్యులు కలుసుకొని, అన్ని విషయాలను పండిత్ పంత్ గృహంలో చర్చించి ఒక ఏర్పాటుకు వచ్చినట్లు తెలుస్తున్నది ఈ ఏర్పాటును పురస్కరించుకొని బిల్లులో పెద్ద మార్పులు ఏమీ జరగవని, పరిశీలనా సంఘం నివేదించిన రీతిగా అన్ని అంశాలను కాంగ్రెసు సభ్యులు ఆమోదించగలరని తెలుస్తున్నది.

---

# శిశు వ్యాధుల చికిత్స

## రష్యా సహాయంతో ఢిల్లీలో ఏర్పాట్లు

న్యూఢిల్లీ, ఆగస్టు 31: ఢిల్లీలోని లేడీ హార్డింజ్ వైద్య కళాశాలలో ఏర్పరుప దలిచిన మర్దన (శిశు పక్షవాతం వగైరా వ్యాధులకు) చికిత్సా కేంద్రమూ, శిశువ్యాధి చికిత్సా కేంద్రము రష్యన్ డాక్టర్ల, సాధన సామగ్రి సహాయంతో వచ్చే యేడాది నెలకొల్పబడగలవని కోరుతున్నామని ఇవ్వాళ రాజ్యసభలో ఆరోగ్య మంత్రిణి రాజకుమారి అమృతకౌర్ తెలియచేశారు.

దీనికిముందు ఆరోగ్యశాఖ ఉపమంత్రిణి శ్రీమతి మరగతం చంద్రశేఖర్ సభముందు ఒక ప్రకటన వుంచారు. అందులో 1955 జనవరిలో భారతదేశం వచ్చి చూసిన రష్యన్ వైద్య వేత్తలు ఈ కేంద్రాలు ప్రారంభించాలనీ శిశువ్యాధి చికిత్సా విధానాల బోధనా, చికిత్స రష్యాలో వలె విస్తృతంగా పెంపొందించాలనీ చేసిన సూచనలను ప్రభుత్వం అంగీకరించిందని వుంది.

# మద్య వస్తువుల దిగుమతి

## ప్రభుత్వానికి మినహాయింపు హక్కు

న్యూఢిల్లీ, సెప్టెంబర్ 1: మద్య నిషేధ రాష్ట్రాలకు సారాయి కలిసిన వస్తువుల దిగుమతిపై నిర్బంధాలు విధిస్తున్న కంట్రోలు బిల్లును రాజ్యసభ నేడొక సవరణ చేసింది. ప్రత్యేక ప్రకటన ద్వారా ఈ వస్తువుల్లో వేటి నయినా ఏలు నియమాలనుంచి మినహాయింపుచేసే అధికారాన్ని కేంద్రప్రభుత్వానికి ఇస్తూ రాజ్యసభ బిల్లును సవరించింది.

లోక్ సభ ఆమోదించిన బిల్లు పాఠానికి ఈ సవరణ చేయబడ్డది కనుక మళ్ళీ ఇప్పుడు లోక్ సభ ఈ సవరణమీద తిరిగి చర్చ జరిపి ఆమోదించవలసి వున్నది. ఈ సవరణను కాంగ్రెస్ ప్రతినిధి కె. టి. తెయువా ప్రతిపాదించారు.

నేటి చర్చలో అనేకమంది సభ్యులు ఈ బిల్లునుంచి ఆయుర్వేద రసాయనాలను కొన్నిటిని (అసవాలు, అరిష్టలు మొ॥) మినహాయించాలని కోరారు. లేకపోతే ఆయుర్వేద విధానం దెబ్బతింటుందని వారు హెచ్చరించారు. మాధవ మీనన్, ప్రొ॥ వాడియా ప్రభృతులు ఈవిధంగా వాదించారు. కాని హైదరాబాద్ పి. ఎస్. పి. సభ్యుడు కిషన్ చంద్ గారు మాట్లాడుతూ ఆయుర్వేద రసాయనాలను మినహాయిస్తే, కంట్రోలను తప్పించుకునేందుకు పెద్ద అవకాశం అవుతుందన్నారు. హెచ్. పి. శాక్సేనా ప్రభృతులు ఈ వాదాన్ని సమర్థించారు.

సాధ్యమైనంత త్వరలో రాజధాని ఢిల్లీ నగరంలో కూడా మద్యనిషేధాన్ని అమలు జరపాలని కె. డి. వైద్యాగారు హెచ్చరించారు. నియమాలను ఉల్లంఘించేవారికి శిక్షలు ఇంకా కఠినంగా ఉండాలని శ్రీమతి సావిత్రీ నిగం అన్నారు.

నందూరి ప్రసాదరావుగారు మద్యనిషేధాన్ని పోలీసు చర్యల ద్వారా అమలు జరపటం సాధ్యపడదని అన్నారు. ఎస్. మహంతీగారు మద్యనిషేధం అమల్లో ఉన్నచోట్ల అది విఫలమయిందని అన్నారు. ఈ కారణంవల్ల ఆ సమస్యపై వాస్తవిక వైఖరిని అనుసరించటం అవసరమని అన్నారు.

చివరకు తెయువాగారి సవరణ ఆమోదించబడ్డది.

# 9 భారతీయ ఉద్గ్రంథాలు

## యూరప్ భాషలలోకి అనువాదం

న్యూఢిల్లీ, సెప్టెంబరు 1: తొమ్మిది భారతీయ ఉద్గ్రంథాలు ఫ్రెంచి, ఆంగ్ల భాషలలోకి అనువదించబడనున్నవని కేంద్ర విద్యాశాఖ ఉపమంత్రి డా॥ శ్రీమాలి ఇవాళ రాజ్యసభలో చెప్పారు. ఐక్యరాజ్యసమితి విద్యా విజ్ఞానిక సంఘం వేసిన పథకం క్రింద ఈ కార్యక్రమం అమలు జరుగుతుందని ఆయన చెప్పారు.

ఈ క్రింది తొమ్మిది గ్రంథాలూ ఇందుకు ఏరారు 'గోదాన్' (ఆంగ్ల, ఫ్రెంచి భాషలలోకి) కృష్ణకాంతుని మరణ శాసనం (ఆంగ్లంలోకి) 'తుకారాం'చే అభాంగ్,' కామయానిని, (ఫ్రెంచిలోకి) అది గ్రంథంలోని కొన్ని భాగాలు (ఆంగ్లంలోకి), ప్రాచీన భారతీయ సాహిత్యసంపద (ఆంగ్లంలోకి), కంబరామాయణం (ఆంగ్లంలోకి) శిలప్పదికారం (ఫ్రెంచిలోకి) హాల్దార్ వైవమత సారస్వతం (ఫ్రెంచిలోకి)

మదరాసు, సెప్టెంబరు 2: మదరాసు రాష్ట్రం హిందీ కుష్టు నివారణ సంఘం సెప్టెంబరు నెలంతా సభ్యులను చేర్చుకుంటూ కుష్టునివారణ ప్రచారం చేయ సంకల్పించారు. కుష్టు వ్యాధి నయమగునా అనే విషయమై ప్రచారం జరుగుతుంది.

---

# డైరెక్టర్ల యోగ్యతలు

## బిల్లుపై లోక్ సభ సభ్యుల సవరణ

న్యూఢిల్లీ, సెప్టెంబరు 1: లోక్ సభ ఇవ్వాళ కంపెనీల చట్టంలోని ముఖ్యమైన నిబంధనలను చాలా వాటిని ఆమోదించింది.

ఇప్పటికి మొత్తం 250 నిబంధనలు ఆమోదంపబడినా, అనుకొన్న ప్రకారం పని జరగనందున రేపు 4 వ తేదీ నుంచీ 9 వ తేదీ వరకూ రోజూ ఇంకొక గంట యెక్కువ సేపు సభ జరపటానికి నిశ్చయించారు.

నేటి చర్చ పండిత ఠాకూర్దాస్ భార్గవ ప్రసంగంతో ప్రారంభమయింది కంపెనీల వ్యవహారాలు దర్యాప్తు చేసేందుకు ప్రభుత్వం నియమించే ఇన్‌స్పెక్టర్లకు విస్తృత అధికారాలు ఇవ్వాలనీ, దర్యాప్తు పద్ధతికూడా ఇతర శాసనాలకు అనుగుణంగా లేదనీ ఆయనన్నారు. శ్రీ జస్వంతరాయ్ మెహతా ఒక కంపెనీ తన లెక్కల తనిఖీకి ఒక ఆడిటరును నియమించుకొన్నా, మరొక ఆడిటరును నియమించవలసిందిగా ప్రభుత్వాన్ని కోరే హక్కు వాటాదార్లకు వుండాలన్నారు. శ్రీ కె. కె. దాసుకంపెనీ శాఖల తాలూకు లెక్కల తనిఖీకూడా తప్పక జరగాలంటూ అందుకు సంబంధించిన 227. వ నిబంధనకు ఒక సవరణ ఉపపాదించారు. కంపెనీ మేనేజిమెంటు సరిగా లేదని అనుమానించటానికి తగిన కారణాలు వున్నప్పుడు కంపెనీ ఉద్యోగులుకూడా దర్యాప్తు చేయించే హక్కు కలిగివుండాలని ఇంకొక సవరణ ఉపపాదించారు. కంపెనీలు ప్రావిడెంటుఫండుకు ఉద్యోగులు చెల్లించిన మొత్తాలను గుర్వినియోగం చేసిన సందర్భాలు వున్నవనీ కనుక ఇది అవసరమనీ అన్నారు. శ్రీ బి. ఓ. ఝున్ ఝున్ వాలా దర్యాప్తు ఇన్‌స్పెక్టర్లకు విస్తృతాధికారాలుండటం అవినీతికి దారితీస్తుందన్నారు. కంపెనీ వాటాదార్లలో నూటికి పదిమంది ప్రభుత్వాన్ని ఆడిటరును నియమించవలసిందిగా కోరితే ఆప్రకారం చేయాలన్నారు. శ్రీ సి. సి. షా ప్రయివేటు కంపెనీలు నిల్వబేరీజు పట్టీలనూ, లాభనష్టాల వివరపు పట్టీలనూ రిజిస్ట్రారుకు అందచేయ నక్కర్లేదని శ్రీ తులసీదాస్ కిలాచండ్ ఉపపాదించిన సవరణలను తీవ్రంగా వ్యతిరేకిస్తూ ప్రయివేటు కంపెనీల పరిస్థితిని ప్రజలు తెలుసుకోవటం చాలా అవసరమన్నారు. ఈ చట్టంలోని దాదాపు 100 ముఖ్యమైన నిబంధనలు ప్రయివేటు కంపెనీలకు వర్తించకుండా చేశారనీ, ఈవిధంగా వాటికి చాలా రక్షణ ఇచ్చారనీ ఆయనన్నారు.

### మోసాలను అరికట్టే వీలు

రెవిన్యూ, పౌరఖర్చుల మంత్రి శ్రీ ఎం. సి. షా చర్చకు సమాధానమిస్తూ కంపెనీల వ్యవహారాల దర్యాప్తు విషయంలో ప్రభుత్వం విస్తృతాధికారాలు తీసుకొంటున్నమాట నిజమేననీ, వాటాదార్లనూ, ప్రజలనూ కనుమరగించేవారిని పట్టుకోవటానికి పాతశాసనంలోని నిబంధనలు చాలలేదని అనుభవంవల్ల తేలటమే ఇందుకు కారణమనీ అన్నారు. చార్టర్డ్ అక్కౌంటెంట్స్ ఇన్‌స్టిట్యూట్ కు చెందనివారిని కూడా ఆడిటర్లుగా నియమించుకోనివ్వటం మంచిదికాదన్నారు. ఈ చట్టం ఆమోదింపబడి, కొంతకాలం పనిచేశాక చూసి, ప్రభుత్వంఆడిటర్లను నియమించటం అవసరమేమో ఆలోచిస్తామనీ, అవసరమనిపిస్తే అందుకు వెంటనే ఒక సవరణచట్టం తెస్తామనీ అన్నారు. తమ స్వంత ఆడిటరును నియమించుకొనే హక్కు వాటాదార్లకు వుండటం చాలా ముఖ్యమైనదనీ, అందుచేత ఇప్పుడు ఆ అధికారాన్ని ప్రభుత్వం తీసుకోదలచలేదనీ, కనుకనే ఈ విషయంలో సవరణను ఆమోదించజాలమనీ అన్నారు. నిల్వబేరీజు పట్టీలనూ, లాభనష్టాల వివరపు పట్టీలనూ రిజిస్ట్రారుకు దాఖల్ చేయకుండా కొన్ని కంపెనీలను మినహాయించాలనే దానికి కూడా తాము అంగీకరించజాలమన్నారు. యోగ్యత గల ఆడిటర్లచే తనిఖీ చేయించిన లెక్కలను దాఖల్ చేయటానికి ఈ కంపెనీలు ఎందుకు వెనకాడుతాయో తమ కర్థంకావటం లేదన్నారు ఇందులో కొన్ని కంపెనీలను మాత్రమే మినహాయించి, రెండురకాల కంపెనీలను ఏర్పరచటం అసలే మంచిది కాదన్నారు. నిల్వబేరీజు పట్టీలూ, ఆడిటరు రిపోర్టులూ పొందే హక్కు వాటాదార్లకు వుండాలన్న సవరణను ఆమోదించారు. దీనివల్ల వాటాదార్లు ఒక రూపాయి ఫీజు కట్టి వీటిని పొందవచ్చు.

తర్వాత సభవారు 208 నుంచి 250 వరకూ గల నిబంధనలను ఆమోదించారు అటుపైన 251 నుంచి 283 వరకు గల నిబంధనలను చర్చకు తీసుకొన్నారు. ఇవి డైరెక్టర్ల నియామకం మొదలైన వాటికి సంబంధించినవి.

### డైరెక్టర్ల యోగ్యతలు

ప్రారంభంలోనే శ్రీ షా కొన్ని చిన్న సవరణలు ఉపపాదించారు. వాటిలో ఒకటి, ప్రభుత్వం నియమించే డైరెక్టరును కంపెనీ జనరల్ బాడీ మీటింగ్ లో తీర్మానం ద్వారా తొలగించటానికి వీలులేకుండా చేస్తున్నది. శ్రీ సాధన్ చంద్రగుప్త చాలా సవరణలు ఉపపాదించారు. వాటిలో ఒకటి, వరసను పదవీ విరమణ చేసే డైరెక్టర్ల సంఖ్య ఎక్కువ ఉండాలని సూచిస్తోంది. ఆయన చేసిన మరొక ఉపపాదనలో డైరెక్టరు కావటానికి వుండవలసిన వాటా మొత్తం రూ. 5000 నుంచి రూ, 500 లకు తగ్గాలని సూచిస్తోంది. ఈపరిమితి రూ. 5000 లని వుంచటంవల్ల సమర్థులు డైరెక్టర్లు కాకుండా చేయటం జరుగుతోందనీ, ధనికులు డైరెక్టరుకాకుండా ఇదేమీ చేయటం లేదనీ ఆయనన్నారు. ఉద్యోగులు కూడా డైరెక్టర్లను యెన్నుకునే అవకాశం కలిగించే ఒక నిబంధనను చేర్చాలనికూడా ఆయన ఒకఉపపాదనచేశారు. ఒకవ్యక్తి మొత్తం 10 కోట్ల రూపాయల పెట్టుబడికి మించని లేక 10 కంపెనీలలోకంటె ఎక్కువ వాటిలో డైరెక్టరు కారాదనీ, పన్నులు ఎగగొట్టే వారు డైరెక్టర్లుగా వుండరాదని నిషేధించాలనీ శ్రీ గుప్త అన్నారు.

### ఉద్యోగుల ప్రతినిధులు

శ్రీఅశోక మెహతా ప్రగతిభావాలుగల కంపెనీలు కొన్ని అప్పుడే ఉద్యోగుల ప్రతినిధులను డైరెక్టర్లుగా తీసుకుంటున్నాయనీ, ఢిల్లీలోని ఒక బట్టలమిల్లు ఉద్యోగుల ప్రతినిధులిద్దరిని డైరెక్టర్లుగా యెన్నుకోవటానికి ఏర్పాటు చేసిందనీ, అన్నారు. 1947 లో అఖిభారత కాంగ్రెసుసంఘం కంపెనీలలో కార్మికుల భాగస్వామ్యం గురించి చేసిన తీర్మానాన్ని ఉదహరిస్తూ స్వాతంత్ర్యం వచ్చి 8 యేండ్లు అయినతర్వాత ఈనాడు ఇంకా కంపెనీ మేనేజిమెంటులో కార్మికులకు భాగం కలిగించటానికి వేచివుండాలని మంత్రి వాదించటం తమకు అర్థంకావటం లేదనీ అన్నారు. డైరెక్టర్లందరూ కూడా నైష్పత్తిక ప్రాతినిధ్యపద్ధతిని ఎన్నికగావాలంటూ ఆమేరకు ఒక సవరణను ఉపపాదించారు. అధికోత్పత్తికీ నైష్పత్తిక ప్రాతినిధ్యానికీ లంకెఉన్నదన్నారు. దీనిని అనుమతిస్తే చాలదనీ, నిర్బంధం చేయాలనీ అన్నారు. ఒకవ్యక్తికి 20 కంపెనీల డైరెక్టరు పదవి వుండటం ప్రమాదకరమన్నారు. శ్రీ యు. ఎం. త్రివేది 279 వ నిబంధన డైరెక్టర్లకు వయః పరిమితి నిర్ణయిస్తున్నదనీ, ఆతర్వాతి నిబంధన జనరల్ బాడీ ఈ పరిమితిని మినహాయించవచ్చునంటున్నదనీ విమయినప్పటికీ ఈ వయః పరిమితి చట్టంలో వున్నట్టు 65 ఏండ్లు కాక, బ్రిటన్లో వున్నట్లు 70 ఏండ్లు వుండాలనీ అన్నారు. శ్రీ వాధ్వానీ డైరెక్టర్లలో మూడింట రెండు వంతులమంది నైష్పత్తిక ప్రాతినిధ్య పద్ధతిని ఎన్నిక కావాలని నిర్బంధం చేయాలంటూ ఒక సవరణ ఉపపాదించాడు శ్రీ ఆర్. ఆర్. మొరార్కా కూడా నైష్పత్తిక ప్రాతినిధ్య పద్ధతి ప్రవేశ పెట్టాలంటూ, 1936 లో కంపెనీల చట్టం కేంద్ర శాసనసభలో చర్చించబడినప్పుడు ఎస్ సత్యమూర్తి, అసఫాలీ, ఎన్. ఎం. జోషీ ఇదే కావాలంటూ చేసిన ప్రసంగాలను ఉదహరించాడు, అప్పట్లో నెహ్రూ, గోవింద వల్లభపంత్ కూడా దీనిని బలపరిచారన్నారు. పబ్లిక్ అక్కౌంట్స్ కమిటీ, అంచనాల కమిటీకూడా ఈ ప్రాతినిధ్య పద్ధతి నే ఏర్పడి సుస్థిరంగాపని చేస్తుంటే కంపెనీల నిర్వహణలో ఈ పద్ధతి పని చేయదనే భయానికి తావెక్కడ వున్నదన్నారు. ఇది కంపెనీలవారి ఇష్టానికే వదలిపెడితే లాభం లేదనీ, నిర్బంధం చేయాలిసిందేననీకూడా అన్నారు శ్రీ తులసీదాస్ కిలాచండ్ ఈ నైష్పత్తిక ప్రాతినిధ్యపద్ధతి పనిచేయదనీ, కనక పనికిరాదనీ అన్నారు.

### ప్లానింగ్ కమిషన్ భూసంస్కరణల సంఘం

న్యూఢిల్లీ, ఆగస్టు 31: ప్లానింగ్ కమిషన్ నియమించిన భూసంస్కరణల సంఘం తాలూకు కౌలు వ్యవహారాల ఉపసంఘం నిన్న మీరట్ జిల్లాలోని గ్రామాలకు వెళ్లి అక్కడి పరిస్థితులను పరిశీలించి, తెలుసుకొన్నారు.

దీనికి ముందు వీరు ఇక్కడ రెండు సార్లు సమావేశమై చర్చలు జరిపారు. ఈ సమావేశాలకు శ్రీ యుతులు ఆర్. కె. పాటిల్ (చైర్మన్), శ్రీమన్నారాయణ్, శంకరన్ నాయర్, హెచ్. డి. మాలవీయా, ఎన్. ప్రసాదరావు హాజరైనారు.

ఈ సంఘం ఈ నెలలో బీహార్, ఉత్తర ప్రదేశ్ రాష్ట్రాలకూ, అక్టోబరులో మద్రాస్, తిరువాన్కూరు-కొచ్చిన్ రాష్ట్రాలకూ వెళతారు.

### ప్రపంచ పెట్టుబడి సంస్థలో భారతదేశం

న్యూఢిల్లీ, సెప్టెంబరు 1. ప్రపంచ బ్యాంకు ఆధ్వర్యాన ఏర్పడే అంతర్జాతీయ పెట్టుబడిసంస్థలో సభ్యరాలుగా భారతదేశం చేరుతుందని నేడు రాజ్యసభలో ప్రశ్నలకు జవాబిస్తూ ఆర్థిక మంత్రి దేశముఖ్ వెల్లడించారు. ఆసంస్థలో 2 కోట్ల 11 లక్షల రూపాయలవు వాటాలను కొనేందుకు భారత ప్రభుత్వము నిశ్చయించింది.

బ్రిటనుకు భారత మిల్లువస్త్రాల ఎగుమతులు ఈఏడు ద్వితీయ పాదంలో కొంత తగ్గినవని వాణిజ్యమంత్రి కర్మార్కర్ నేడు లోక్ సభలో ప్రశ్నలకు జవాబిస్తూ వెల్లడించారు. భారతదేశం నుంచి దిగుమతి చేసుకునే గుడ్డలో ఎక్కువ భాగాన్ని బ్రిటను కొంత పెంచుకుని తిరిగి ఎగుమతి చేస్తుందని ఆయన తెలియజేశారు.

---

# నిమ్నజాతులకు ప్రభుత్వ ప్రోత్సాహం

## ఉచిత విద్యా సౌకర్యాలు ఉద్యోగాల్లో ప్రత్యేకత

న్యూఢిల్లీ, సెప్టెంబరు 1: నిమ్నజాతులు, నిమ్న తరగతులు పరిస్థితులమీద రాష్ట్ర ప్రభుత్వాల సహాయంతో కేంద్రప్రభుత్వంవారిని ఉద్ధరించడంకోసం యుద్ధాన్ని సాగిస్తున్నదని దేశీయాంగ శాఖ ఉపమంత్రి శ్రీ దాతార్ నిమ్నజాతి, తరగతి కమిషనర్ 4 వ నివేదికను చర్చకుగాను ప్రవేశపెడుతూ లోక్ సభలో ఉద్ఘాటించారు.

"ప్రస్తుతం ఈ విషయంలో సాధించిన అభివృద్ధి కమిషనర్ అనుకున్నంతగా లేదు. ఆయనకు ఈ పరిస్థితిని అతికాలంలో బాగుచేయగలనన్న ధైర్యం వుంది" అని గూడా శ్రీ దాతార్ తెలియజేశారు.

రాష్ట్రాలలోను, కేంద్రంలోను నిమ్నజాతుల, నిమ్న తరగతుల అభివృద్ధికి జరుగుతున్న కృషిని, పనులను శ్రీ దాతార్ తమ ఈ ప్రసంగంలో వివరించారు. ప్రభుత్వం జరిపించే ఉద్యోగ పరీక్షలకు హాజరయేందుకు ఈ వర్గం విద్యార్థులకు ఉపకార వేతనాలు ఇచ్చి, ముందుగా శిక్షణ ఇప్పించాలని తాము ఆలోచిస్తున్నట్లు ఆయన పేర్కొన్నారు.

ప్రభుత్వోద్యోగాల్లో చేర్చుకునే నిమిత్తం వున్న వయః పరిమితి మొదలైన నిబంధనలను ఈజాతుల విషయంలో సడలించడానికి గూడా ఆలోచనలు జరుగుతున్నట్లు తెలియజేశారు.

### ప్రత్యేక శాఖలు

నిమ్నజాతుల అభివృద్ధి వ్యవహారాన్ని పరిశీలించేందుకు, పరిశీలించి ఇంకా ఏమిచేయవలసివుందో నిర్ణయించేందుకు రెండు విభాగాలు ప్రారంభింపబడినట్లు ముఖ్యంగా ప్రభుత్వంలో ఈజాతులవారికి ఉద్యోగాలు ఇప్పించే విషయమై పని చెయ్యడానికి విభాగాలు వున్నట్లు శ్రీ దాతార్ వెల్లడిచేశారు.

నిమ్నజాతులకు విద్యాసౌకర్యాలను కల్పించటం విషయమై మాట్లాడుతూ, వీరికి ఉచితంగా విద్యాబోధన జరిగే ఏర్పాటు ప్రభుత్వం చేసివున్నారని ఉన్నతవిద్యకు వీరిని పంపించడానికి గూడా గట్టికృషి జరుగుతున్నదని, వీరికి తగు సదుపాయాలు కల్గించే నిమిత్తం విద్యార్థి వేతనాలు ఇవ్వడానికి గ్రాంట్లు ఇస్తున్నారని వివరించారు. 1954-55లో ఈ గ్రాంట్లు 48 లక్షల రూపాయలదాక ఇచ్చారు.

ఉద్యోగాలు విషయంలో గూడా ఈ జాతులపట్ల ఔదాసీన్యం వహిస్తున్నదేమీ లేదని, ఒక్క కేంద్ర ప్రభుత్వం వివిధ శాఖల్లోను 15 లక్షలమంది నిమ్నజాతులవారు ఉద్యోగాలు చేస్తున్నారని ఆయన చెప్పారు. అఖిల భారత ఉద్యోగాల్లో నిమ్నతరగతుల వారికి నూటికి 12½ స్థానాలు ప్రత్యేకించబడి వున్నాయి. ఇతరత్రా నూటికి 16 2/3 స్థానాలు ప్రత్యేకించబడినాయి. నిమ్నజాతులవారికి 5½ స్థానాలు ప్రత్యేకించబడ్డాయి అన్నారు.

# మధ్యతరగతి వారికి గృహవసతి

(1 వ పేజీ తరువాయి)

15, 20, లేక 25 వాయిదాలుగా నిర్ణయమవుతుంది.

(4) అప్పును ఇవ్వటమన్నది కూడా ఇల్లుకట్టడం ఎట్లా జరుగుతున్నదో గమనించి, అనుకూల వాయిదాలమీద కిస్తీలుగా ఇవ్వబడుతుంది. అయితే పని ప్రారంభించటానికి వీలుగా, దరఖాస్తు ఆమోదించబడిన వెంటనే, తగినంత మొత్తం ఇవ్వబడుతుంది.

(5) అప్పులో మొదటి కిస్తీ ఇచ్చిన 18 నెలల తరవాత చెల్లింపులో మొదటి కిస్తీని తీర్చాలి.

(6) వడ్డీ నూటికి సం॥ నికి 4½ రూపాయలు ప్రభుత్వం ఇచ్చే వాటా మాత్రం ఇన్సూరెన్స కంపెనీకి 4½% వడ్డీకి ఇవ్వబడుతుంది ఈ రేటును అంతా ఏ కంపెనీకి ఆ కంపెనీలో ఒక ప్రత్యేక హామీ నిధిగా ఏర్పాటు చేస్తారు.

(7) అప్పుతో కట్టిన ఇంటిని ఆ అప్పుకు హామీగా తాకట్టుకింద ఉంచబడుతుంది.

(8) ఈ పథకంకింద ఇచ్చే ఋణాలకూ, జనిత భీమాలకూ సంబంధం ఉండదు. అప్పుతీసుకు వేవాళ్లు ఇష్టపడితే తరవాత ఈ ఏర్పాటు చేసుకోవచ్చు.

# ఆగ్నేయాసియా సంగీతసభలు

మనిలా, సెప్టెంబరు 1: ఆగ్నేయాసియా ప్రథమ సంగీత మహాసభలు నిన్న ఇక్కడ సమాప్తమైనవి. ప్రాంతీయ సంగీత సమితి నిబంధనలు, నియమావళి స్వీకరించి పాలక వర్గాన్ని ఎన్నుకున్నారు. వివిధదేశాల ప్రతినిధులు సంగీత శాస్త్రం, సంగీత విద్యాబోధన, కీర్తనాది నివేదికలు సమర్పించారు.

---

# పరిశ్రమలపై వచ్చే పిర్యాదులు

## శీఘ్రపరిష్కారానికి ఏర్పాట్లు

న్యూఢిల్లీ, సెప్టెంబరు 1: దేశంలో రక్షణ కలిగించబడిన పరిశ్రమల గురించి వచ్చిన ఫిర్యాదుల విషయంలో సత్వర దర్యాప్తులు జరిపించటానికి వాణిజ్య పారిశ్రామిక శాఖలో ప్రత్యేకపు ఏర్పాట్లు చేయబడినవని వాణిజ్యశాఖ మంత్రి శ్రీ డి. పి. కర్మార్కర్ ఇవ్వాళ లోక్ సభలో తెలియచేశారు.

దేశంలోని కొన్ని పరిశ్రమలకు విదేశీ పరిశ్రమల పోటీ లేకుండా చేయటానికి దిగుమతి నిర్బంధాలు, సుంకాల విధింపు మొదలైన వాటిద్వారా ప్రభుత్వం రక్షణ కలిగిస్తోంది. దీనిని అవకాశంగా తీసుకొని ఈపరిశ్రమలవారు నాణ్యం విషయంలోనూ, వెలల విషయంలోనూ వాడకం దారులకు నష్టం కలగకుండా ఏమైనా జాగ్రత్త తీసుకున్నారా అని సర్దార్ అకార్ సింగ్ ప్రశ్నించగా శ్రీ కర్మార్కర్ ఈసమాధాన మిచ్చారు.

# జిల్లా బోర్డుల పునర్నిర్మాణం

## త్వరలో మంత్రివర్గ ఉపసంఘ సమావేశం

కర్నూలు, సెప్టెంబరు 2: జిల్లా బోర్డుల స్పెషల్ ఆఫీసర్ల పదవీకాలం, డిసెంబరు 10 వ తేదీన పూర్తి అయిపోతుంది. అప్పటికి జిల్లాబోర్డులను పునర్నిర్మించడానికి ప్రభుత్వం శాయశక్తులా ప్రయత్నిస్తుందని స్థానికసంస్థల మంత్రి డా॥ ఎ. బి. నాగేశ్వరరావు గారు చెప్పారు.

జిల్లాబోర్డుల భవిష్యత్తు విషయం పరిశీలించడానికి ఏర్పాటైన మంత్రివర్గ ఉపసంఘ సమావేశం ఈనెల మధ్యలో జరుగుతుంది.

# అంధవిద్యార్థులకు ఉపకార వేతనం

న్యూఢిల్లీ, సెప్టెంబరు 1 హైస్కూలువిద్య పూర్తిచేసిన అంధవిద్యార్థులకు 1955-56 వ సంవత్సరానికి విద్యార్థివేతనాలు యిచ్చేనిమిత్తం దరఖాస్తులగడువు తేదీని పొడిగించడానికి భారత ప్రభుత్వం నిర్ణయించింది. 1955 సెప్టెంబరు 10 తేదీవరకూ దరఖాస్తులు తీసుకుంటారు.

